# జయంతి

## ౨

సం. ౧ నం. ౨ డిసెంబరు, ౧౯౫౮

---

ఈ సంచికలో

# జయంతి



జయంతి తే సుకృతినో
రససిద్ధాః కవీశ్వరాః.




సంపాదకమండలి :

విశ్వనాథ సత్యనారాయణ (అధ్యక్షులు)
దివాకర్ల వేంకటావధాని
మల్లంపల్లి సోమశేఖరశర్మ
కేతవరపు రామకోటిశాస్త్రి
జువ్వాడి గౌతమరావు

సంవత్సర చందా ౯-౦౦
విడిప్రతి ౭౫ న. పై.

# పాఠకుల ఉత్తరాలు

పత్రిక నాకు ఎంతో నచ్చింది. కారణాలు

1. కుక్షింభర పత్రిక కాకపోవడం.

2. అడ్వర్టయిజుమెంట్లు లేకపోవడం. ఏ వ్యాసం మధ్యనో సిలోన్ రేడియోలోవలె, తలనొప్పితో బాధ పడకండి. ఆస్ప్రో-అంటూ ఉండకపోవడం.

3. ఈనాడూ అంత గట్టి సంపాదకీయమూ, శాకుంతలంమీద వ్యాసమూ కనబడడం.

జయంతి తొలిసంచికలో ఉన్నవ లక్ష్మీనారాయణ గారిని గురించివుంటే ఎంతో బాగుండేది. ఆయన జయంతికి రాయబారాలపై వ్రాసారని కాదు. చాలా సంబంధం ఉన్నవాడు అని గుర్తు.

పత్రికలో అచ్చుతప్పులు యికనైనా రాకుండా చూడండి. వెనక జయంతికి ప్రూఫులు మహామహులు పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు దిద్దేవారు కాబోలు. ప్రస్తుతం ఆ విషయంలో మరీ శ్రద్ధ పెట్టాలి.

*జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి*
మదరాసు

మీ పత్రిక విషయ సౌందర్యంతో భాసిస్తూ నిరాడంబరంగా రావటం సాహసయత్నంగా నేను భావిస్తాను. పత్రిక ముచ్చటగా ఉంది.

సంపాదకీయం మరీ దీర్ఘమై సంపాదకీయ పరిమితి కతీతమైన విషయ ప్రస్తావనతో సాగడం అనవసరమేమో। అదే విషయాలను ప్రస్తావించే సంపాదకీయాలు రెండు మూడు పత్రికలలో క్రమశః ప్రచురింపబడితే బాగుండేదేమో। శ్రీ విశ్వనాథ వారి వ్యాసం చాల బాగున్నది. క్రమశః ఈ వ్యాస పరంపర చదవగల్గడమనే ఆశాభావం నన్ను పారవశ్యంలో ముంచుతున్నది. శ్రీ సంపత్కుమార వ్రాసిన నీవు అనే శీర్షికతో ఉన్న పద్యాలలోని భావం అంతుపట్టటంలేదు. బుచ్చిబాబుగారు "కార్యసాధకుల మహాకావ్యం" కన్న గొప్ప కథ లెన్నో వ్రాశారు. మరికొన్ని మంచి కథలు వారివి ప్రకటిస్తారని ఆశిస్తున్నాను.

"కావ్య స్వరూపం" అనే వ్యాసం అనవసరం. ఈ విషయాలన్నీ అనేకమంది అనేక పర్యాయాలు చర్విత చర్వణంగా చెప్పి విడిచినవే. ఇలాంటి వ్యాసాలు వేయడం కాక Applied Poetics గూర్చిన వ్యాసాలు ప్రకటించడం ద్వారా అధిక ప్రయోజనం సాధించబడగలదు. రమణారెడ్డిగారి వ్యాసం. శ్రీదేవిగారి కథానికా బాగున్నవి. సామెతల కథలు ఇంక కొన్ని వ్రాయించటం బాగుంటుం దనుకొంటాను. విరోధులు అన్న చెఖోవ్ కథకు గతంలో అసంఖ్యాక అనువాదాలు వచ్చాయి. అనుసరణలూ, మూలకర్త పేరుచెప్పని చౌర్యాలూ కొల్లలు. అలాంటి పాత కథలు గాక క్రొత్త కథల అనువాదాలు ప్రకటించడం మంచిది. ప్రూఫుల విషయంలో మరికొంత శ్రద్ధ తీసుకొందురు గాక—

*సోమసుందర్*
పిఠాపురం

పత్రిక నిరాడంబరంగా చక్కగా వుంది. అందరి మాట ఎలావున్నా అస్మదాదులకుమాత్రం ఇట్టి పత్రిక పదికాలాలపాటు మన్నితే బావుండును అనే ఆశ కలుగుతోంది. బుచ్చిబాబుగారి రచన లాంటివి కనీసం సంచిక కొకటైనా వస్తూంటే ఈనాటి పత్రికా ప్రపంచంలో 'అవహేళన' (satire) లేవి పెద్ద వెలితిని 'జయంతి' కొంతైనా పూడ్చడానికి ప్రయత్నించగలదు. అయితే అట్టివాటిలో అవహేళన ఇంకా చిక్కగా వుండి హాస్యంపాలు కొంత హెచ్చుగా ఉండటం మంచిది. (తరువాయి ౫౪ వ పేజీలో)

# తేజశ్చక్రము | సుప్రసన్న

అంతరీన బహుళ భావనా ప్రదాన ప్రధాన
భ్రాంతిజ్ఞాన సంఘర్షణము పడలేనయా, తేల్చుకో అ
నంత జీప పరివార ! ఇది అదో అది ఇదో నీవ
అంతస్సన్నిధి కల్పించినాను నీ యిష్ట మిక మీద.

వినుము శబ్దముల చివళ్ల వెదుక బోయెదను కాని వాని
కొనలు ఆ గగనమ్ము కొట్టకొసలకు ముడి వేసితివట.
అనుకోని ఊహలివి వచ్చు, అందుకోలేను శబ్దరూప
మును లోభిసొమ్ము వ్యర్థమ్ము అన్నమాట నిజము.

ఈ యూహ ఈ శబ్దమందె ఏల చేయబడవలయును
ఆ అపుడు శబ్దమే లేదు ఆ నాడు ఊహ ఎట్లుండె ?
ఈ అనంతమైన ఆకాశమే శబ్దమై పొల్చియుండు
ఆ అవ్యక్త శబ్దమే అందెనో ఊహల వికారము.

అయినచో నీవు అవ్యక్తమైన ఆకాశ స్వరూపు
డయినావు, పరమేశ్వరుడ వఖిల శబ్ద స్వరూపుడవు.
లయవేళయైన లోకమును లయింపు, మలయము శబ్ద
మయ మహాలోకమ్ములందు మద్గళము జీవించుగాక !

ఈ గాలు లెంత మృదువులో ఇవి నన్ను స్పృశియించునంత
నా గుండెలో ప్రణవనాద నదులు పారినట్టి స్మృతులు
ఆగమములలో విన్నామయా ! నిన్నుగూర్చి వాక్కు-
లే గురితప్పి యిచ్చటికి తిరిగి ఏతెంచునంట.

ప్రణవ వేదమ్ములను నడుమ బంధించి పెట్టిన దెవండు
ప్రణవమే విస్తరించి వేదభావమ్ము పొందినదొ ఏమొ ?

ప్రణవాగ్రమందు దీపమవు, కనుల మిర్మిట్లు గొలిపితివి
అనేక కిరణముల నాగమాంతములకు కుదువబెట్టి.

ఆగమాకాశమందు ప్రణవ మన్నది చంద్రబింబమ్మ
సోగ వెన్నెల లుపనిషత్తులు శుద్ధ తమస్సులము మేము
దాగి యుండెదము, వెన్నెల అందము కూడ మెచ్చుకోలేము
ఆగవయా ! చంద్రునిలో అమృతమై కూర్చున్నవాడ !

ఒకదానిలో వేర ఒకటి ఒదుగలేక రెండు కూడ
వికసించు నవస్వరూప వీథి గగనపృథ్వు లట్లు
సకల విశ్వాధారమైన సహస్ర సహస్రాణు పరిష
త్తు కూడెనా ? తేజోదేవీ కేళీ లాస్యమ్ములు.

ఒక రోచిర్దేవి మిగిలి సకల భూతములు లయించి
ఒక మహాస్సారణి స్రవించి ఉల్లోల కల్లోల మగుచు
సుకవీంద్ర వాఙ్నిరాదృతి సూచిగా సకల విశ్వమ్మ
ఒక వెల్గు సహస్రకమలమ్మ వికసితానంద సూర్యమ్మ.

నీ నేత్ర మార్గమ్ములందు నిలచిన దీ పంచభూత
మైన విశ్వమ్మ - అన్వయించి - అనంత తేజమయి వచ్చి
ఈ నా తేజశ్చక్రము ఈ దారుల విచ్చుకో, కృ
పా నీలకాంతి ప్రవాహ ! ఆదుకో, ఆదుకో స్వామి !

శ్రీహాసమోహనా ! ఏతచ్చిత్ర సంసృష్టి దోహన !
ఊహామధురతావధి, నమ ఉక్తిభావనా పరాంకోటి !
సోఽహమి త్యల్లీన భూత శుద్ధ తేజస్సుదర్శన ! మ
దైహికా ముష్మిక యాత్రా స్వయంవ్యక్త సౌందర్య దీప !

# తెలుగువారి తొలి సంగీత రూపకం

తిరుమల రామచంద్ర

మనసులో పొటమరించి మాటలకు అందీ అందనట్టున్న భావాలను మధురంగానూ, స్పష్టంగానూ, వ్యక్తపరచడంలో, మానవుని కవిత్వం, సంగీతం, ఆదుకున్నాయనవచ్చు. ఈ రెండింటినీ ఆసరాగా చేసుకొని మరొక రస ప్రపంచంలోకి మనలను చేదుకొనిపోయి నిలువగల జిగి బిగీ ఉన్న కళా రూపం నాట్యం. కనుకనే కాళిదాసు "నాట్యం భిన్నరుచేర్జనస్య బహుధాప్యేకం సమారాధనం" అన్నాడు.

మాటలూ, పాటలూ, ఆటలూ, నాగరకతా ప్రాదుర్భావం నాటినుంచి నేటిదాక, మానవ హృదయ వ్యక్తీకరణకు బలీయమైన సాధనాలుగా అనుక్రుతంగా ఉంటున్నవి. కనుక ఒక జాతి జానపద సారస్వతం తీరుతీయములు మరొక జాతి సారస్వత సరణికి యాదృచ్ఛికంగా పోలవచ్చునేమో కాని తదనుకరణాలు మాత్రం కాజాలవు. అలాంటప్పుడు తెనుగుతనమే జీవగఱ్ఱగా గల బుఱ్ఱకథలు ఏ మహారాష్ట్రి సంప్రదాయం నుంచో, కన్నడం నుంచో పుట్టుక వచ్చాయని ఆపాత మధురంగా ఎవరైనా అన్నప్పుడు సత్య దృష్టి సహృదయతా గల ప్రతి తెలుగువాని మనస్సు చివుక్కు మనకపోదు.

గీతనాట్య కవిత లనే కళాస్వరూపాలు మూడూ మూడు రేకులై విచ్చిన విరి బుఱ్ఱకథ. సంస్కృత రూపకాల కాలంలో నాటకానికి మూల మనదగిన వీథి, భాణం వంటి ఏకాంకికలవలె బుఱ్ఱకథ కూడ తెలుగువారి ప్రాచీన రూపక మనదగిన యక్షగానానికి పూర్వస్వరూప మనుకుంటాను. కాని ఇంత మౌలికమైన తెనుగుతనం జాలువారుతున్న బుఱ్ఱకథను సోమనాథుడు తన బసవపురాణంలో గాని, వీథీరూపకాన్ని తెనుగుచేసిన వల్లభరాయడు గాని స్పష్టంగా పేర్కొనకపోవడం చూడగా, ద్విపద భూయిష్ఠమైన ఈ రచనకు పక్క వాద్యాల ప్రాబల్యాన్నిబట్టి తర్వాత తర్వాత ఈ పేరు రూఢమై ఉంటుంది.

జానపద సాహిత్యంలో ప్రధానంగా గోచరించేది ద్విపద చ్ఛందమో, తద్వికారమైన మంజరియో; శ్రీనాథుని కాలానికి ముందునుంచే ద్విపదప్రబంధం బుఱ్ఱకథవంటి గాన రూపంలో ఉందనడానికి వీథి నాటకమే సాక్షి. అతని కాలాని కింకా వైభవం తరుగని ఏకశిలానగరంలో

"ద్రుత తాళంబున వీరగుంభితక
ధుం ధుం ధుం కిటాత్కార సం
గతి వాయింపుచు నాంతరాళిక
లయగ్రామాభిరామంబుగా
యతిగూడం ద్విపద ప్రబంధమున
వీరానీకముం బాడె నొ
క్కృత ప్రత్యక్షరముం గుమారకులు
ఫీట్కారంబునం దూలగన్.

ఇక్కడ వీరగుంభితకను వాయించినది ఒక స్త్రీ. పాడినది ద్విపదప్రబంధం. దాని ఇతివృత్తం వీర చరితం. 'గుంభితక' అనగానే పాఠకులకు నేడు బుఱ్ఱ కథలలో తాము చూచే గుమ్మెటలు స్ఫురించక పోవు. అప్పటిలాగే ఇప్పుడూ బుఱ్ఱకథలలో గుమ్మెటలు వాయించేవారు స్త్రీలే. కథకగాయకుడు మాత్రం పురుషుడు. కనుక బుఱ్ఱకథ కాకతీయుల కాలంనుంచి వస్తున్నదనడం నిస్సందేహం. కాని కొద్ది మార్పులు రావడం కాలానుగుణంగా

సహజం. గుంభితకే గుమ్మెట. రెండు పదాలూ దానిని వాయించేటప్పుడు ఏర్పడిన ధ్వని విశేషాను కరణ జన్యాలే.

బుర్రకథకు జంగం కథ, తందాన కథ, తంబురా కథ అనే ప్రాంతీయ వ్యవహారా లున్నాయి. ఆరె కాపులు తోలుబొమ్మలాటను వృత్తిగా ప్రచారం చేసినట్టు, సిరిజంగాలనే తెగవారు బుర్రకథలను ప్రచారం చేశారు. వీరి లక్ష్యం శివపారమ్య నిరూపణం, శివపారమ్య ప్రచారం. ఈ కథలు చెప్పడమనేది క్రమంగా వీరి వృత్తి అయింది. రూపక పద్ధతిని రచించిన, చెప్పిన కథాంతరాలూ జంగం కథ లనే వ్యాప్తికి వచ్చాయి. సిరిజంగాలు పగటి వేషాలు వేస్తారు; వీధి భాగవతాలు కడుతారు; కథలు చెబుతారు.

దీనిలో గుమ్మెట వాద్యమే ప్రధానం కదా! "గుమ్మెట కథ" అనే వ్యవహారానికి మారు బుర్ర కథ అనే వ్యవహారం ఎందుకు వ్యాప్తమైంది? అనే శంక పొడముతుంది. ఈ కథలో స్త్రీల ప్రాధాన్యంపోయి కథకగాయకునికి ప్రాధాన్యం కలిగినట్టే కథకగాయకుడు శ్రుతిసారించే తంబురా బుర్రకూ ప్రాధాన్యం వచ్చింది. దానిని బట్టి బుర్రకథ అని రూఢమైందని అనుకుంటాను. తందాన కథ, తందాన పాట అనే వాడుక తందానతాన తానతందాన అనే వంతలవారు - గుమ్మెటలు వాయించే స్త్రీలు- చేసే అనుక్రుతిని బట్టి వచ్చింది. నిజానికి బుర్రకథ, జంగంకథ అనేపదా లన్నిటి కంటే తందాన కథ అన్నదే ప్రాచీన వ్యవహారం.

అకలంక స్థితి గోరి కొల్చెదరు
  బ్రహ్మానంద సంభావనన్
సకలానందమయైక మాత లగుచున్
  సంతోష చిత్తంబునన్
తకదుమ్మల్ మకతాళముల్ జవనికల్
  తందాన లమ్మయ్యకున్
ఏకవీరమ్మకు మాహురమ్మకు నధో
  హ్రీంకార మధ్యాత్మకున్.

అని తందాన పాటలను క్రీడాభిరామకర్త పేర్కొన్నాడు. తందాన పాటలంటేనే నేటికీ రాయలసీమలోను, మరికొన్ని తెలుగు ప్రాంతాలలోను అర్థమౌతుంది కాని, బుర్రకథలంటే త్వరగా అర్థంకాదు.

కథకగాయకుడు ఒక చేత్తో శ్రుతికోసం తంబురా మీటుతూ, జేబురుమాలు వంటి గుడ్డ కొనను కట్టిన జంతరను మరొక చేతి బొటనవ్రేలికి తొడుక్కుని తాళంవేస్తూ కథ చెబుతాడు. తాళం వేసే జంతరను గుంచీలు, అందెలు అని అనడం కూడా కద్దు. కథకునికి ఇరుప్రక్కలా ఇద్దరు స్త్రీలు గుమ్మెటలు-వీర గుంభితకలు వాయిస్తూ రకరకాల వంతలు పాడుతారు. వంతకోసం ఇరువురు ఇంతులు కావాలని సిరిజంగాలు రెండు పెండ్లిండ్లు చేసుకొనడం కూడా ఆచారం.

ఇదీ బుర్రకథ చరిత్ర. ఇక ఇది మౌలికమైన తెలుగు సంప్రదాయమే అనడానికి దీనికి ఇతర జాతుల జానపద రచనలతో- ముఖ్యంగా పరిసర జాతీయ విజాతీయ జానపద రచనలతో- సాదృశ్య వైదృశ్యాలు పరిశీలిద్దాము.

తెలుగు బుర్రకథతో మహారాష్ట్రుల 'పవాడా'కు గాని, కన్నడుల 'లావణీ'కి గాని జానపద సారస్వతమనడం తప్ప మరేమిటా పోలికలేదు.

శివాజీ సింహగఢ విజయగాథను వినని వారుండరు. ఆ విజయం శివాజీకి చేకూర్చినవాడు తానాజీ మాలసురే. తానాజీ, మరికొందరు మరాఠీసైనికులు 'పవాడా' గాయకుల వేషంతో కోటలో ప్రవేశించి, దానిని జయించారు. జానపద గాన పద్ధతిని రాజకీయాలకు ఉపయోగించినవారిలో ప్రథముడు తానాజీ.

"పవాడా" అంటే వీరచరిత్రాన్ని వర్ణించే జానపద కవితా విశేషం. (కోణేక్ పరాక్రమీ పురుషాంచే జ్యాంత వర్ణన కేలే అసతే అసా ప్రాకృత కవితా విశేష అశతో—రఘునాథ భాస్కర గోడబోలేగారి మరాఠీ నిఘంటువు) పవాడాకు కీర్తి అనే మరొక అర్థంకూడా ఉంది. ప్రవాదః అనే

సంస్కృత పద తద్భవం పవాడా అని కొందరు పండితు లన్నారు.

పవాడాను కూర్చొని, నిల్చుని పాడుతారు. ఇది మన భజన గోష్ఠివలె ఉంటుంది. దీనిలో వీరరసం తప్ప మరొకటి ఉండదు. వెనుక వంతగా "దీదీ దీదీ" అంటూ కొందరు రాగాలు తీస్తారు. స్త్రీల ప్రసక్తే దీనిలో లేదు. మన బుఱ్ఱకథలో లాగ నిలుచుని నాట్యం, వివిధ రసాభినయం వంటి రూపకచ్ఛాయ 'పవాడా' లో ఎంతమాత్రమూ కనిపించదు.

ఇక కన్నడ "లావణీ" ప్రాచీనమన్నమాట వాస్తవమే. ప్రాచీన ఛందఃకారులు షట్పదిని పరిగణించినట్టుగా దీనిని పరిగణించకపోయినా అర్వాచీన ఛందఃకారులు గ్రహించారు. 16 వ శతాబ్దినుంచి మనకు కన్నడ లావణీ లభిస్తుంది. 17 వ శతాబ్దంలో నందివర్మ దీనిని తన ఛందో గ్రంథంలో ఉదాహరించి లక్షణం చెప్పాడు.

"లావణీ" అనేది జానపద గాథలు తెలిపే ఛందో విశేషం. ఇది గ్రామీణ జీవిత గాథలను వివిధ రసాల లోను, ప్రకృతి సౌందర్యాన్ని వివిధ రీతులతోను వర్ణిస్తుంది. ఇద్దరుగాని ఒక్కరుగాని నిలుచుని పాడుతారు. వంతపాట ఉండదు. దీనికి మన బుఱ్ఱకథకూ నిలుచుని పాడడమనే పోలిక తప్ప మరే పోలికా లేదు.

మరాఠీలోను లావణి ఉన్నది. దానిలో స్త్రీలు పాడడం, చేతులు తిప్పడం వంటి అంగికాభినయం ఉన్నవి. కాని కథావిధానం ఉండదు. గుమ్మెటల వంటి వాద్యాల ప్రసక్తి లేదు. అది కేవలం స్త్రీల పేరంటపు పాటలవంటి దనినా అనవచ్చు.

"మరాఠీ కీర్తన పద్ధతినుంచి బుఱ్ఱకథ ప్రభవించ గూడదా ?" అని ప్రశ్నించేవారు ఉన్నారు. ఈ కీర్తన పద్ధతి లక్ష్యం దైవ నిరూపణం. ఇతివృత్తం దైవమాహాత్మ్యం తెలిపే పురాణకథ. ఇదే మన హరికథగా పరిణమించింది. 'తోహారా' వంటి మహారాష్ట్ర సంప్రదాయ గీతాలవల్లనే మన హరికథపై మరాఠీ కీర్తన పద్ధతి ప్రాభవం ఎంత ఉన్నదీ తెలుసు కోవచ్చు. కీర్తన పద్ధతిలో వంతపాట ఉన్నమాట నిజమే. జోడు గుమ్మెటల చేడియలు ఉండరు. జంతర ప్రసక్తిలేదు; నాట్యం అసలే నాస్తి. కనుక బుఱ్ఱకథతో కీర్తన పద్ధతికి ఏ పొత్తూ లేదు.

ఏతావతా శ్రీనాథునికి ముందుకాలంనుంచి వీరగుంభితకల - నేడు గుమ్మెటల - "ధుం ధుం కిటాత్కార సంగతితో" వీనుల విందవుతున్న బుఱ్ఱ కథ - తందాన పాట - తెలుగువారి తొలిమౌలిక సంగీత రూపకమంటే సహృదయులందరూ సంభా విస్తారనడం నిస్సంశయం.

ధూళిపాళ శ్రీరామమూర్తి

# శ్యమంతకోపాఖ్యానము : ఎఱ్ఱన

'ఈ ఋషు లెవ్వరు చెప్పిన
సారకథాకథన మొక్క చాయనె నడచున్
వీరంతర్ద్రిష్టలు బహు
ధారూపిత సూక్ష్మతర కథాంశులు సుమ్మీ ।'

ఈ పద్యము శ్రీమద్రామాయణ కల్పవృక్షము లోనిది. శతానందుడు విశ్వామిత్రుని కథచెప్పినప్పుడు విని రాముడు లక్ష్మణునితో నన్నమాట యిది. ఈ పద్యమునందు కథాకథన మననేమో దానిని చెప్పుట కుండవలసిన లక్షణములేవో మనకు తెలియుచున్నవి. ఆ శతానందుని కథాకథన వైఖరిని శ్రీరామచంద్రుడు మెచ్చుకొన్నాడు. ఆ ఋషు లెవ్వరు చెప్పినను ఆ కథాకథనమంత జగన్నాథముగా నుండును. మన దేశమునందు లౌకిక సాహిత్యముకూడ మహర్షులే వెలయించిరి. వాల్మీకి వ్యాసులు మహర్షులు. వారు మహాకావ్యనిర్మాణ మొనరించి ఒక మహా సంప్రదాయమును నెలకొల్పిరి. మన తెలుగుకావ్యములు కూడ ఆ ఋషినిర్మిత సంప్రదాయానుసారములై విలసిల్లు చున్నవి. తెలుగుకవులు పర్ణకవితాంశములను ఆ ఋషిసంప్రదాయమునుండి పుణికి పుచ్చుకొనిరి. అందుచేత పైపద్యము వీరికికూడ అన్వయించును.

కవిత్రయమునందు నన్నయ తిక్కనలనుగురించి చాలినంత విమర్శన యున్నది. ఈ యెఱ్ఱనగారిని గురించి లేదు. నన్నయ తిక్కనలకున్న గౌరవము ఎఱ్ఱనగారికి లేదని కొందరు తలంతురు. కాని ఇది సరికాదు. భారతమును వ్రాయుటకు నన్నయ తిక్కనల కెంత యధికారమున్నదో ఎఱ్ఱనగారి కంత యున్నది. ఆయన యేవిషయమునందును నన్నయ తిక్కనలకు తీసిపోడు. కథాకథనమునందు నన్నయ్య యెంత దక్షుడో ఎఱ్ఱన్నగా రంత దక్షుడు.

కథాకథన మన నేమియో పై పద్యమును పరిశీలించిన మనకు దెలియును. కథకున కుండవలసిన లక్షణములు రెండు. ఒకటి అంతర్ద్రిష్టృత; రెండవది బహుధారూపిత సూక్ష్మతర కథాంశత్వము. అనగా ఆ కథకు సంబంధించిన సూక్ష్మ సూక్ష్మతరాంశములను బహువిధములుగా నిరూపింపగలిగి యుండుట. ఇందు మొదటిది కథయందు ప్రధానమైన ఆత్మలక్షణము చెప్పును. రెండవది కథయొక్క శరీరమును, తదంగములను చెప్పును. లోకమునందు ఏ సంఘటనము జరిగినను ఆ సంఘటనము జాగ్రత్తగా విచారింపబడి సృష్టి మూలతత్వమును వ్యాఖ్యానము చేయును. ప్రతిసంఘటనము ఏదియోయొక దృక్కోణమునుండి సృష్టియొక్క వైయర్థ్యమును ఆ సృష్టి దేనియం దాధారపడి యున్నదో అట్టి పరమేశ్వర తత్వమును చెప్పుచునే యుండును. కావున కథకుడు ఆ సంఘటనముయొక్క బహిస్స్వరూపమును చీల్చుకొని దానియందు నిగూఢమై యున్న పరమేశ్వర తత్వమును ప్రత్యక్షీకరించుకొనవలయును. ఇది అంతర్ద్రిష్టయైన ఋషికే లేక ఋషికల్పునకే సాధ్యము. అంతర్ద్రిష్టయైనవాడే కథయొక్క ఆత్మను పట్టుకొనగలడు. ఆ కథ యాత్మ పట్టుపడనిదే ఆ కథను వ్రాయుదుననుట 'ప్రాంశులభ్యే ఫలే లోభా దుద్వాహురివ వామనః' వంటిది. మరి రెండవ లక్షణమున్నది. ఇది కథయొక్క రచనమునందలి శిల్పమునకు సంబంధించినది. పైన చెప్పిన సంఘటనములో బహ్యాంశము లున్నవి. ఈ బహ్యాంశములు ఆ సంఘటనముయొక్క మూలతత్వమునందు సహజముగా ముడిపడి యుండును కాని ఆ మూలతత్వము నెరుంగనివానికి ఆయా యంశముల యందున్న పరస్పర

సంబంధము. అవి ఒక్కొక్క దానియందు ప్రతిబింబించుకొనుచున్న ఆ మూలతత్వపు వైఖరి, సామాన్యదృష్టికి అందదు. సంఘటనాగతములైన సర్వాంశములు బహు దృక్కోణములనుండి ఆ సంఘటనయొక్క ఆత్మను ప్రతిబింబించుచున్నట్లు నిరూపితములు కావలయును. అప్పుడు మాత్రమే వానికి ఆ సంఘటనాంశత కుదురును. దానితో ప్రవేశము కుదురును. లేనిచో నీళ్ళకునీళ్ళు. ప్రసాదమునకు ప్రసాదము. ఒక కథనుగురించి ఇంత లెస్సగా విచారించి వ్రాయువాడే అచ్చమైన కథకుడు. ఎఱ్ఱన్నగారట్టి కథకుడు. ఆయన రచించిన ఏ కథను తీసికొన్నను ఆయన దక్షత మనకు వ్యక్తమగును. ఇచ్చట శ్యమంతకోపాఖ్యానమునందలి ఆయనయొక్క కథాకథననైపుణి వివరింపబడుచున్నది.

ఈశ్యమంతకోపాఖ్యాన మందరెఱిగినదే. వినాయక చతుర్థి పండుగనా డందరు చెప్పుకొనుచున్నదే. వినాయకుని చవితినాటి చందురుని చూచిన నీలాపనిందలు కలుగును. ఆ నీలాపనిందలు కలుగకుండ ఈ కథను చదివికొందుము. ఈ కథను చదువుటకు నీలాపనిందలు తొలగుటకు సంబంధమున్నదన్న మాట. ఆ సంబంధముయొక్క స్వరూపమేమి? ఆ సంబంధము ఇదియని కొందరనుకొందురు. ఈ కథయందు భగవంతుడైన శ్రీకృష్ణునికి నీలాపనిందలు కలిగినవి. వాని నాయన తొలగించుకొన్న కథయిది. భగవద్విషయికమైన అపనిందాపగమన వృత్తాంతము కల్మషహరమగును అని. స్థూలముగా ఈ యభిప్రాయము మనకున్నది కాబట్టియే మన మీ కథను చదువుకొనుచున్నాము. దీనినే కొంచెము వివరించుకొందము. ఈ కథ నీలాపనిందలను తొలగించును అంటిని గదా. నీలాపనిందలు అననేమి? అవి యెట్లు వచ్చును? వచ్చినచో వానిని యెట్లు తొలగించుకొనవలయును? ఈ విషయములను ఈ కథ చక్కగా వ్యాఖ్యానము చేయుచున్నదన్నమాట. ఎందుచేతననగా మనకు నీలాపనిందల భయమున్నది. ఒక దానిని గురించి మనకు భయమున్నదనగా దాని స్వరూప స్వభావములు మనకు తెలియవన్నమాట! అది సంక్రమించినచో దానిని తొలగించుకొనుట మనకు తెలియదన్నమాట. ఈ తెలియని యజ్ఞానమే భయము. ఆ నీలాపనిందల స్వరూప స్వభావములు వానిని తొలగించుకొను వైఖరి మన మెరింగితిమేని మనకు వాని వలన భయముండదు. పై కథ వాని స్వరూప స్వభావములను వానిని తొలగించుకొను వైఖరిని మనకు వ్యాఖ్యానము చేయుచుండుటవలననే మనము దానిని చదువ వలయుట. కాబట్టి ఈదృశ వ్యాఖ్యానము ఈ కథయొక్క ప్రాణము. ఇట్టి వ్యాఖ్యానము ఈ కథాముఖమున భగవంతుడైన శ్రీకృష్ణుడు మనకు చేయుచున్నాడు. ఇది ఈ కథలోని వైశిష్ట్యము.

కాని వినాయక చతుర్థి పుస్తకములు అనాడు మనము కొనుచున్నాము. ఆ పుస్తకములలో ఒకటి రెండు పుటలలో ఈ కథ చెప్పబడును. ఆ కథ మనము చదివినచో దానియందు ఈ పై వ్యాఖ్యానము కూడియున్నదా? దానియందు మణి కృష్ణు డపహరించినాడని, ప్రసేనుని కృష్ణుడు చంపినాడని సత్రాజిత్తు అపోహపడి వాదు పుట్టించును. శ్రీకృష్ణుడు అరణ్యమునకుపోయి ప్రసేనుని సింహము చంపు టెరింగి జాంబవంతుని గుహలోనికి పోయి మణి తెచ్చి తన యపవాదును బాపుకొనును. ఈ యంశములే ఆ పుస్తకములయందలి కథలో వివృతమగును. అపనింద శ్రీకృష్ణున కెట్లు కలిగినదో ఆ సత్రాజిత్తట్టి వాదెందుకు వేయవలయునో ఆ యపవాదును బాపుకొనుటకు శ్రీకృష్ణు డట్టి మార్గమునే యేల యవలంబింపవలయునో ఆ కథలయందు మనకు దొరుకవు. ఈ ప్రశ్నలకు సమాధానము అందింపజేయునట్లు కథ వ్రాయుటకు అనంతమైన లోకజ్ఞత కావలయును. ఈ కథ అంతయు లోకమే. మరి ఎఱ్ఱాప్రగడ కథయందు ఈ లోకజ్ఞత అనంతముగానున్నది.

సత్రాజిత్తు పరిశుద్ధ శీలుడు. అతనియందు సూర్యుడు ప్రసన్నుడైనాడు. ఈ సత్రాజిత్తు సూర్యుని

గురించి పదునొకండు దినములు ఆరాధించినాడు. ఆ సూర్యు డతనికి ప్రత్యక్షమైనాడు. సత్రాజిత్తన్నాడు గదా "దేవా! నీవింత దురాలోకుడవైనచో నిన్నెట్లు నేను కాంచెదను?" అని అప్పుడు సూర్యుడు నవ్వి "ఇది నా ప్రకాశము కాదు ఈ మణి ప్రకాశము. దీని పేరు శ్యమంతకము" అని అటుచూడుమని దానిని తీసి అతని మెడయందు పెట్టి వరము వేడుమన్నాడు. సత్రాజిత్తుడా మణిని వరముగా వేడినాడు. ఇది ఒక ఘట్టము. సూర్యుడు దేవత. సత్రాజిత్తు ఆరాధకుడు. సత్రాజిత్తు మెడలో సూర్యుడా రత్నమును పెట్టుట ఉచితము కాదుకదా! దేవతకును ఆరాధకునకు ఉన్న సంబంధము స్వామి సేవక సంబంధముకంటె యెక్కువ యైనది. మరి యా రత్నమును మెడ యందు పెట్టినగాని సత్రాజిత్తు రత్నమును కోరడు. సత్రాజిత్తున కిత్తమనియే సూర్యుడా రత్నమును దెచ్చెను. మరి అతనిచేత కోరించుకొనిగాని ఆ రత్న మియ్యరాదు. అతనిచేత కోరించుకొనవలయు ననగా ఆ రత్నముయొక్క మాహాత్మ్య మతనికి తెలియ వలయును. అందుచేత తాను దానిని ధరించి వచ్చి నాడు. దాని కాంతిచేతనే తనకంత తేరిచూడరాని ప్రకాశము కల్గినదని చెప్పినాడు. ఆ మణి తీసిపుచ్చి నచో కాని ఆ మణియొక్క మాహాత్మ్య మేదియో సత్రాజిత్తునకు తెలియదు. అదితీసి యెక్కడ పెట్టును? అది తన శరీరమునం దెచ్చట దాచినను దానికాంతి తనయందు వ్యాపింపక మానదు. అది సత్రాజిత్తునకు కనిపింపరాదు. సత్రాజిత్తునకు కనుపించ నప్పుడే అది తాల్చినప్పటి తనకును దానిని పుచ్చినప్పటి తన కును భేద మతనికి తెలిసి మణియొక్క ప్రభావము సంపూర్ణముగా ఎరుగ గలడు. అది యాతనికి కను పించకుండ నుండవలె నన్నచో అతని మెడయం దుంచుటకంటె మంచి మార్గము మరియొకటి లేదు. అతని మెడయం దుంచవలె ననగా అత డారాధకు డనియు, తాను దైవమనియు తా ననుకొనరాదు. ఇద్దరి స్నేహితుల మధ్యనే ఇట్టి పని యుచితముగా నుండును. ఈ యభిప్రాయము నంతయు లోపల పెట్టుకొని మొదటి పద్యమునందే అతనికి "మిత్రుం డయ్యె త్రిభువన మిత్రుడు, మిత్రుండు" అన్నాడు.

మరి యిప్పుడు సత్రాజిత్తేమి వరము కోరును? ఆ సత్రాజి త్తెదురుగుండ నున్న సూర్యుని చూచి నాడు. ఆ సూర్యుడు సామాన్య మానవునివోలె కన్పించినాడు. సత్రాజిత్తు తనను తాను చూచికొన్నాడు. తాను సూర్యునివలె ధగధగ లాడుచున్నాడు. మణి మాహాత్మ్యము సత్రాజిత్తున కింతకంటె బాగుగా నెట్లు తెలియును? సత్రాజి త్తామణియే కోరినాడు. సూర్యుడిట్లు పన్ని సత్రాజిత్తునకు మణి నొసంగినాడు. ఇప్పుడు సత్రాజిత్తు మణినే ఏల కోరవలయునన్న ప్రశ్నకు మనకు సమాధానము దొరకినది. 'ఈ యభి ప్రాయ మంతయు ఎఱ్ఱాప్రగడగా రుద్దేశించిరా నీవు స్వకపోల కల్పితముగా చెప్పుచుంటివి గాని' అని యెవరైన ననవచ్చును. "మార్తాండు డట్ల తగంగ నిచ్చి" అని యెఱ్ఱన్నగారు వ్రాసినారు. ఈ ఘట్టము నందు మూడుమాటలు. ఒకటి సత్రాజిత్తునకు 'మిత్రుం డయ్యె త్రిభువన మిత్రుడు మిత్రుండు' రెండు 'అటు చూడుమనుచు నదిపుచ్చి నతనికి నఱుతంబెట్టి వరంబు వేడుమని' మూడు 'అట్లతగంగ నిచ్చి' పై యభి ప్రాయము లేనిచో ఈ మూడు వాక్యములను వ్రాయుట కుదురునా? కుదురునో కుదురదో ఆలోచన కలవారు చెప్పవలసిన మాట. ఈ మూడు మాటలును ఈ ఘట్టమునందు ఎఱ్ఱాప్రగడగారి కథన నైపుణిని పట్టి యిచ్చుచున్నవి.

తరువాత సత్రాజిత్తు మెడలో మణితో ఊరిలోనికి వచ్చినాడు. చూచిన వారంత వానిని సూర్యుడను కొన్నారు. శ్రీకృష్ణునికి నివేదించినారు. శ్రీకృష్ణుడు అసలు సంగతి వారికి చెప్పినాడు. ఇప్పటికి సత్రా జిత్తు మణిమాహాత్మ్య మందరికి తెలిసినది. అది ఉగ్రసేనునకు చేర్చవలయునని శ్రీకృష్ణుని యుద్దే శము. సత్రాజిత్తునకు కృష్ణుడడిగినచో ఈయక తప్పదు. అడుగునేమోయని భయము. కృష్ణునకు అడిగినచో సత్రాజి త్తీయడేమో యని భయము. తా నడుగుటయు అతడీయకుండుటయు తా నూరకుండుట

యునా ? అడుగకుండనే వలయునుకాని అడిగినచో అది కలహకారణము కావచ్చును. మరి మణి తన కెట్లు వచ్చును ? తనంతట తాను నోరు తెరచి యడుగకుండగనే సత్రాజిత్తిచ్చునట్టి పరిస్థితులు కల్పించవలయును. అనగా ఈ మణి శ్రీకృష్ణునకు కావలయునని సత్రాజిత్తునకు తెలిసి తనంత తాను తీసికొనివచ్చి సమర్పింపవలయును. కలహము లేకుండ మణి కావలయునన్నచో ఇంతకంటె గత్యంతరము లేదు. సత్రాజిత్తునకు తన యుద్దేశము తెలియుటకై శ్రీకృష్ణుడు చుట్టములయొద్ద తనకోర్కె సూచించుచు వచ్చెను. ఇది సత్రాజిత్తునకు పూర్వమే తెలియును. దాని కిది బలము చేసినది. ఎప్పుడో ఒకప్పుడు శ్రీకృష్ణుడు వచ్చి అడుగక మానడు. ఈ భయమువలన సత్రాజిత్తు ఆ మణిని తన తమ్ముని మెడలో పెట్టినాడు. తమ్ముని మెడలో పెట్టినచో శ్రీకృష్ణ డడిగిన 'అది నా తమ్ముడు పెట్టుకొను చున్నాడులే' అని తప్పించుకొనవచ్చునుగదా ? ఇట్లు ప్రసేనునకు మణి సంక్రమించినది. ప్రసేనునకు మణి సంక్రమించుట కథ కాయువు పట్టు. ప్రసేనుని వద్ద నీ మణి లేనిచో కథ లేనేలేదు. ప్రసేనునకు సత్రాజిత్తీమణి నీయనేల ? యను ప్రశ్నకు పై పరిస్థితి సమాధానము. అందుచేత ఆ పరిస్థితి ఈ కథయందు మిక్కిలి ముఖ్యమైనది. ఆ యీ పరిస్థితి నంతయు ఎఱ్ఱాప్రగడ కృష్ణుడు 'అయ్యె ప్రసంగం బుల కోర్కి సన్నవారం బలుకుచుండ చుట్టంబు లందరు నెఱింగి యుందురు. సత్రాజిత్తు జనార్దనుని వలన శంకించి యమ్మాణిక్యంబు ప్రసేనున కిచ్చెను' అని వ్రాసినాడు. ఆ మణి శ్రీకృష్ణునకు కావలయునని చుట్టము లంద రెరుగుదురు. అతడు వచ్చి యడుగు నేమో యని సత్రాజిత్తునకు భయము. ఇది శ్రీకృష్ణునకు నీలాపనింద పుట్టుటకు బీజము.

మరి మణియం దొక గుణమున్నది. అది అశుచి యైనవాడు తాల్చిన దాని గుణము చూపించదు. మించి ప్రాణాపద చేయును. ఇది యెవ్వరికిని తెలియదు. ఈ మాటలు వ్రాయనిచో అంత మహిమావంతమైన మణిని తాల్చిన ప్రసేనుడు సింహము చేతిలో చావ నేల ? యను ప్రశ్న యుదయించును. ఇంత జాగ్రత్తగా ప్రశ్నలు పుట్టించుకొనుచు వానికి సమాధానము లభించున ట్లెఱ్ఱనగారు వ్రాయును.

ప్రసేను డడవి కేగినాడు. ఒక సింహము వాని మెడలోని మణిని చూచి మాంసఖండ మనుకొని వానిని చంపినది. జాంబవంతుడు వచ్చి ఆ సింహమును చంపి మణిని కొన్నాడు. శ్రీకృష్ణుడు ఆజాంబవంతుని బిలమునందు సొచ్చి జాంబవంతుని నిర్జించి ఆ మణిని కొన్నాడు. ఈ సింహము, ఆ జాంబవంతుడు వీరిద్ద రశుచులు. ప్రసేనుని వలెనే వీరికిని ఆ మణి యాపదనే చేసినది కాని దాని గుణము చూపలేదు. కాబట్టి మణియందున్న ఈ గుణము కథ యట్లు జరుగుటకు కారణమైనది. అందుచేత ఇది మణికథ. దానియందున్న గుణముచేత దాని కథ జరిగినది. మణియందున్న ఈ గుణ మింత ప్రధానమైనది కాబట్టియే "అదియు నశుచి యైనవాడు దాల్చినం దన గుణంబులు సూపక ప్రాణాపద నొనర్చును" అని యెఱ్ఱన్నగారు వ్రాసెను.

మరి ప్రసేను డెట్లు చచ్చెనో వాని బంధువులకు తెలియదు. వా డా మణిని పెట్టుకొని వేటకు పోయినాడు. వానిని ఆ మణికొర కెవ్వరో చంపియుందు రనుకొన్నారు. ఎవరు చంపియుందురు ? ఈ మణి యందు శ్రీకృష్ణుడు కన్నువేసి యున్నాడు కదా ? కాబట్టి అతడే చంపియుండునేమో యనుకొన్నారు. శ్రీకృష్ణునకు పరివాదము సంప్రాప్తించినది. పరివాదముయొక్క స్వరూపమేమి ? అది యెట్లు ప్రసరించును ? ఇది యంతయు లోకము. వాడు మనతో మాటలాడుచునే యుండును. మన యెదుట నేమియు ననడు. మించి మనమడిగిన నాకు తెలియ దనును. ఎవరో యట్లు చెప్పుకొనుచుండుట నేనును వింటి ననును. కాని వాడవతలకుపోయి తాను చూచినట్లే చెప్పును. ఆ పరివాదము ఇండ్లలో, రచ్చపట్టుల యందు చర్చింపబడుచు ఊరియం దూరేగుచుండును.

మన యెదుటమాత్ర మందరు పెద్దమనుష్యులే. ఆ యిండ్లయందు దారచ్చపట్టులయందు గూడా అంత ప్రకటమైన ఆ పరివాదమును మన కెందుకురా ? మన మనుచున్నట్లు వాని పక్షమువా డెవడైన విని వానికి చెప్పునేమో అని ఒకరి చెవిలో నొక రూదు కొను చుందురు. పరివాదముయొక్క స్వరూప మిది యని ఎఱ్ఱనగారు 'ఇవ్విధంబు కృష్ణకృత్యంబ కానో పునని యొండొరులతోడ నొయ్య నొయ్యన పలుకు చుండ *గర్ణపరంపరం* బరివాదంబు ప్రకటంబగు టయు' అని వ్రాసెను. ఇట్టి పరివాదము శ్రీకృష్ణునకు కలిగినది. లోకమంతయు అగుబ్బుగా చెప్పుకొను చుండిరని శ్రీకృష్ణు డెరింగినాడు. ఆ పరివాదమును పోగొట్టుకొనవలయునన్న ఆత డేమి సేయవలెను? వీధిలోనికి పోయి 'ఎవడురా నన్నన్నది ? నా యెదు టకువచ్చి అన్నచో తెలియును. చాటుగా నేడ్చినచో నేమి లాభము' అని పోట్లాడునా ? ఎవరితో పోట్లా డును ? గాలితో పోట్లాడవలయును. ఆ యన్నవా డెవడో పరమేశ్వరునికికూడ తెలియదు. ఆ యనుట మాత్ర మున్నది. దానిని గాలి మోసికొని వాడవాడల త్రిప్పుచున్నది. ఇది పరివాదముయొక్క స్వరూపము. దీని స్వరూప మిట్టిది. జనముయొక్క స్వభావ మిట్టిది. అని శ్రీకృష్ణు డెరుంగును. ఆ పరివాదమును తాను మాన్పుకొనవలయు నన్నచో ఆ ప్రసేను డెట్లు చచ్చెనో రుజువు చేయవలయును. ఎప్పుడు పరి వాదము తనకు సంక్రమించెనో అప్పుడే జరిగిన దోషమున కసలు కారణము కనుగొని పదిమందికి రుజువు చేయవలసిన బాధ్యత తనపైన బడ్డది. ఈ సంగతి తెలిసినవాడుకావున కృష్ణుడు 'ప్రసేనుని చావుచే టరసెదనని చుట్టంబులు వినబలికి' అరణ్య మునకు పోయినాడు. ఆ యీ యభిప్రాయమునంతను లోపల పెట్టుకొనియే ఎఱ్ఱనగారు 'కర్ణపరంపరంబరి వాదంబు ప్రకటంబగుటయు లోకవేదియగు నయ్యాది పురుషుం డాకీడు మాన్పుకొనుటకై' అని వ్రాసినాడు. పై యర్థము నంతయు 'కర్ణపరంపర' 'లోకవేది' యను మాటలు పట్టి యిచ్చుచున్నవి.

శ్రీకృష్ణుడు అరణ్యమునందు ప్రసేనుని కళేబర మును చూచినాడు. అతనిదగ్గర మణిలేదు. అందు చేత చుట్టుప్రక్కల చూచినాడు. అక్కడ సింహాళవ మున్నది. అచ్చటను రత్నము లేదు. ఋక్షపద చిహ్నము లున్నవి. వానినిచూచి శ్రీకృష్ణు డేమను కొన్నాడు ? 'సర్వాపేక్షణీయంబగు మణికింగల గౌరవంబు నూహించినా' డట. ఈమాట ఇక్కడ వ్రాయనిచో శ్రీకృష్ణుడు సింహాళవము చూడనక్కఱ లేదు. ఎలుగు బిలమునకు పోనక్కర లేదు. అతడు ప్రసేనునియొక్క కళేబరముకొరకుకాదు వెదకునది, ప్రసేనుడెట్లు చనిపోయెనో ఆమణి యేమైనదో ఈ రెంటి నతడు కనుగొనినగాని అతని పరివాద మప గతము కాదు. బిలద్వారమున తన యాప్తులను కాపుంచి కృష్ణుడు లోనికేగినాడు. అచ్చట తొట్టెకు కట్టిన రత్నమును లాగినాడు. దాది కేకపెట్టినది. జాంబవంతుడు వచ్చినాడు. వచ్చుటతోడనే పైన కలియబడినాడు. నీ వెవ్వరని యడుగలేదు. శ్రీకృష్ణున కతడు జన్మాంతర భక్తుడని తెలియును. శ్రీకృష్ణుడు తాను దేవుడననియు యుద్ధ మాడవల దనియు జాంబవంతునకు చెప్పునా ? చెప్పినచో జాంబవంతుడు సాక్ష్య మడుగవచ్చును. అందు చేత కృష్ణుడు తాను దేవుడనని మొదట చెప్పలేదు. జాంబవంతుడు ముష్టియుద్ధ మారంభించినాడు. శ్రీకృష్ణుడును ఆరంభించినాడు. జాంబవంతునకు కోపమున్నది. శ్రీకృష్ణునకు కోపములేదు. జాంబ వంతున కెరుగని వ్యవహారము. కృష్ణు డెరిగిన వ్యవ హారము. అందుచేత జాంబవంతుఁ డుదగ్రకోపమున దాకినాడని "కృష్ణుడున్....తొడరె" నని వ్రాసినాడు ఎఱ్ఱనగారు. ఇరువదియొక్క రోజులు యుద్ధమైనది. బయట నున్న కృష్ణసేవకులు కృష్ణుడు చనిపోయినా డనుకొన్నారు. ఆ యభిప్రాయము వారి మనస్సు లోనికి వచ్చినదో లేదో వారి మనస్సులలో బలదేవుడు కృష్ణాగ్రజు డగుట మాని కృష్ణుడు 'బలదేవానుజు' డైనాడు. సేవకునియొక్క స్వభావమీ మాటలో వెల్ల డించినాడు యెఱ్ఱనగారు. వాని కెవడు వర్తమానమున

రాజో వాడు ప్రధానుడు. ఇరువదియొక్క దినములు యుద్ధము చేసిన తరువాత జాంబవంతుడు బలహీనుడై యోటువడినాడు. బలమద ముడుగగనే శ్రీకృష్ణుడు దేవుడని యత డెరిగినాడు. తనను దయజూచుట కేతెంచిన స్వామి యనుకొన్నాడు. "బలహీనుండై యోటువడి యద్దేవునకు నవినయ ప్రణామం బొనర్చి నీవు నా స్వామివైన దాశరథిగా శంకించెదను చెప్పు"మన్నాడు. జాంబవంతుని ప్రశ్నమునకు శ్రీకృష్ణుడు నవ్వినాడట. ఇరువదియొక్క దినములు నిద్రాహారములు లేని ముష్టియుద్ధము చేసి అత డడిగిన నవ్వినాడు. ఇరువదియొక్క దినములు యుద్ధమైన చేసినాడు కాని ఒక్కమాట తాను దేవుడనని చెప్పినాడు కాదు. ఆ దేవుని యెవనికివా డెరుంగవలయునుకాని ఒకడు చెప్పి లాభములేదు. ఆ దేవుడే వచ్చి చెప్పినను నమ్మువా రుండరు. ఏదియైనను తాను తెలిసికొనుట ప్రధానము గాని యొకడు చెప్పుట కాదు. మరి యిప్పుడు చెప్పవలసిన పని యేమున్నది? తనకెట్లును తెలియనే తెలిసినది కదా దేవుడని. ఈ ప్రశ్న వట్టి పిచ్చిప్రశ్న. అందుచేత నవ్వినాడు కృష్ణుడు. అదిగాక యిప్పుడా యడుగునది, అని నవ్వినాడు. 'అనిన నగుచు' అని వ్రాయుట బహుజన్మములు తపస్సుచేసి కవియైన వానికి మాత్రమే సాధ్యమైన విషయము. తరువాత మణిని జాంబవతితో గూడ పరిగ్రహించి పురంబునకు పోయి తన పరివాదమును శ్రీకృష్ణుడు బాపుకొనెను.

ఏకథకైనను కథకు కథగా గాక అది వెల్లడించిన తత్త్వమునుబట్టి దాని యుపాదేయత యుండును. అసలొక కథ మన మేల చదువవలయును ? ఆ కథ అట్లు జరిగినదని మనము తెలిసికొన్నచో కలుగు లాభమేమి ? అది యెట్లు జరిగిన మనకేమి ? కాబట్టి దానియందలి పరమార్థమేదోయొకటి ప్రధానమై దానికి మన జీవితమునందు వినియోగముండవలెను. దీనినే మన పూర్వులు ఫలశ్రుతిగా చెప్పిరి. ఆ కథ చదువుట వలన ఆ ఫలము కలుగును. అనగా ఊరక చదువుటవలన కలుగునదికాదు. ఆ ఫలముయొక్క స్వరూపమేమియో అది యేవిధముగా పొందవచ్చునో దానికి వలసిన సాధన సామగ్రియొక్క స్వరూపమేమియో లెస్సగా తెలిసికొనుటయే చదువుట. తత్ఫల స్వరూప సాధనముల ఆ కథ ద్వారమున కథకుడు మన కుపదేశించును. ఇది యా కథయందు గూఢముగా నుండును. ప్రశస్తుడైన కథకుడు వానిని పట్టి యిచ్చుటకు అచ్చటచ్చట వ్యంజక సామగ్రి నిక్షేపించును. వానిని పాఠకుడు అనుశీలనాభ్యాస పాటవమున కనుగొని వ్యాఖ్యానించుకొనవలయును. ఆ కథ అట్లు జరుగవలయుట విధినిర్దేశము. కాబట్టి అది యట్లే జరిగితీరును. విధియొక్క ఈ అనుల్లంఘనీయత పరమేశ్వరుడు దిగివచ్చినను తప్పదు. కాని అది పరమేశ్వరాశ్రితమైనపుడు దానికి లోకసంగ్రహత కల్గును. ఆ పరమేశ్వరుడు ఆ విధి నిర్దేశము నాశ్రయించి లోకమున కిట్లు బ్రదుకవలెనని చూపించును. అన్నింటిని మించి విధియొకటున్నది. దానికి కారణము మనము చేసికొనిన జన్మాంతర కర్మము. దానినిబట్టి బుద్ధులు ప్రసరించును. మన మొకటి యనుకొనిన యొకటి జరుగును. 'రత్నహారీతు పార్థివః' కాబట్టి శ్రీకృష్ణుడు ఉగ్రసేనున కామణిని చేర్చవలెననుకొన్నాడు. రాజునొద్దకంటె గొప్పమణి ఇతరునొద్ద నుండరాదు. అది వానికి మదకారణమై పర్యవసానమున ధర్మభంగ హేతువగును. అందుచేత శ్రీకృష్ణుడు దానిని రాజువద్దకు చేర్చవలెననుకొన్నాడు. ఈ యనుకొట వెంట పది పుట్టినవి. ప్రసేనుని చావు జరిగి పరివాదము వచ్చినది. కాబట్టి యీ యనుకొనుట పరివాదమునకు బీజము. మనకు నీలాపనింద కలిగినదనగా దానికి కారణ మెక్కడనో లేదు. మన మెప్పుడో దాని యందు సంబంధము కలిగియున్నాము. అది యిట్లు పరిణమించినది. ఇంత తెలిసి దానిని బాపికొనుటకు ప్రయత్నించవలయును. ఆ పాపికొనుటకు లోకజ్ఞత సామర్థ్యము ఎంతయో యుండవలయును. ఇట్లాలోచించినకొలది ఈ కథ పరమార్థబోధకమగుచున్నది.

* * *

మురయా

# పండుగనేర్పిన పాఠం

ఆ పండుగకు మా పెద్దక్కయ్యా వాళ్ళింటికి వెళ్ళక తప్పింది కాదు. ఇంతదూరం ఇప్పు డెందుకే మరోసారి వస్తాను" అని వ్రాసినా అది ఒప్పుకో లేదు. రాక తప్పదంటూ ఉత్తరాలపై ఉత్తరాలు. "మీ అల్లుడి పుట్టినరోజుకూడా ఆరోజే అయ్యింది. అటు పండుగా కలిసివస్తుంది. ఏమైనా ఈసారి నువ్వు రాక తప్పదు. వాడి కేమైనా కొనిమ్మని నీవు పంపిన పైకం అందింది. కాని నువ్వుకనుక రాకపోతే-రేపూ ఎల్లుంటిలో బయలుదేరి వస్తున్నట్లు నీ దగ్గరనుంచి ఉత్తరం కనుక రాకపోతే-ఆడబ్బు వెంటనే తిరక్కొట్టేస్తానంటున్నారు మీబావ. నువ్వు రాకపోతే నాకు కష్టంగలిగేసంగతి అల్లా ఉంచు. ముందు మీ బావకు నీమీద నిజంగా కోపం వచ్చేస్తుంది" అంటూ దీర్ఘమైన జాబు వ్రాసి నన్ను ఒత్తిడి చేసింది మా పెద్దక్కయ్య. దానికి నేనంటే ఎందుకో చెప్పలేని ఆపేక్ష. మా పెద్ద తమ్ముడు " ఒట్టి అమాయకుడండీ " అంటుంది అందరితోనూ. నేను పెద్దవాణ్ణయి. ఎమ్మే అయినా దాని దృష్టిలో నేనింకా అమాయకుణ్ణే. వెళ్ళానా ఇక నన్ను ఓపట్టాన కదిలి రాలివ్వదు. వెళ్ళివెళ్ళడంతోటే తలకు నూనె పట్టించేసి "ఒరేయి నువ్వు తలంటి పోసుకొని ఎన్నినెలలయిందిరా" అంటూ గంటసేపు తలరుద్ది రెండు గంగాళాలనీళ్ళు పొయ్యాల్సిందే. ఉన్న నాలుగురోజులూ ఎంతసేపూ దానికి నా విషయమే. నా ఆరోగ్యం, నా తిండీ, నా బట్టలూ....ఒకటేమిటి సమస్త విషయాలూ కనుక్కోవలసిందే. "ఎందుకే అక్కయ్యా నీ కింత ఇది। ఇప్పుడు పెద్దవాణ్ణయినాను గదటే" అంటే "నీ మొహం" అంటుంది. ఏదో యాంత్రికంగా గడచిపొయ్యే సాధారణపు జీవిత వాతావరణంనుంచి ఒక్కసారి - ఇంత ప్రేమ, ఇంత ఆప్యాయత వెల్లివిరిసే వాతావరణంలోకి రావడం అంటె నాకేదోలా ఉంటుంది. అందుకే కొన్నిసార్లు అక్కడకు వెళ్ళడం తప్పించుకొన్నాను. కాని ఈసారి వెళ్ళక తప్పింది కాదు.

నాలుగురోజులు సెలవు సంపాదించి వస్తున్నానని ముందుగా వ్రాశాను. నేను వెళ్ళాక రెండో రోజున వెళ్తానని ప్రయాణమైతే అది ఎల్లాగో "ఈ పూట మంచిది కాదు. రేపు వెళ్దువుగాన్లే" అని అనక మానదు. సరే పోన్లే అని ఉండిపోయి ఆమర్నాడు బయలుదేరితే "ఒరేయి నా మాట విని అల్లా వెళ్ళి మీ ఆఫీసుకో టెలిగ్రాం యిచ్చిరా యివ్వాళ రావడం లేదని రేపు సాయంత్రం వెళ్దువుగాన్లే" అంటుంది. ఎందుకో చెప్పదు. ఎందుకే అంటే "నన్నూరికే విసిగించకురా. చెప్పాగా రేపు వెళ్ళొచ్చుని" అంటుంది. నన్ను అంత దూరంనుంచి పిలిపించినందుకు మరో చిన్న పిండివంట చేసిపెట్టుకొని, తలంటి పోసి పండగ చెయ్యాలని దాని ఆరాటం. ఇదంతా మామూలే. దాన్ని చూడంగానే నాకూ, నన్నుచూడంగానే దానికీ హృదయం పొంగిపోతుంది. తిరిగి వచ్చేసేటప్పుడు నా మనస్సుకు ఎంత కష్టంగా ఉంటుందో। ఇదీ ఒక కారణంగా అక్కడికి వెళ్ళడము తప్పించుకొంటూ వచ్చాను. కాని ఈసారి వెళ్ళక తప్పిందికాదు.

* * *

నేను గుమ్మంలో దిగేసరికి మా అక్కా వాళ్ళిల్లు చాలా క్రొత్తగా అందంగా కన్పించింది. ఇంటికి సున్నం కొట్టించారు. తలుపులకూ, కిటికీలకూ, రంగులు వేయించారు. పెళ్ళివా రిల్లులా ఉన్నది. మా

బావగారు కొంచెం దర్జామనిషి. ఆయన స్వయంగా తహసీలుదారు కాకపోయినా అంతకు మించి దర్జాగా కన్పిస్తారు. ఆయన తహసీలుదారుగారి ముద్దుల కొడుకు. మంచి ఆస్తిపరుడు. చిన్నప్పటినుంచి కూడా మాంచి హుందాగా గడిపిన వ్యక్తి ఆయన.

బండి దిగంగానే మా అల్లుడు "అమ్మోయ్ పెద మామయ్యొచ్చేడేయ్!" అని కేకపెట్టాడు. అందరి కంటె ముందుగా నా దగ్గరకు పరుగెత్తుకు వస్తూ. వాడి మాటలు వినికాబోలు మా అక్కయ్య గబగబా వరండాలోకి వచ్చింది. వరండా దాటి వీధిగుమ్మం లోకికూడా వచ్చేసింది. మా బావ వరండాలోనే నిల్చుని "అవన్నీ వాడు తెస్తాడులే నువ్వురా" అంటు న్నారు. "ఇదేనా రావడం" అంటూ పొంగిపోయింది మా అక్కయ్య. "రావేమో అనుకొన్నారా. మొత్తం మీద వచ్చేశావు" అంటూ నా చేతిలోని పంచి తా నందిపుచ్చుకొని లోపలకు నడిచింది. నన్ను చుట్టేసు కొంటున్న మా అల్లుణ్ణి ఎత్తుకొని నేనూ దానివెంట వస్తుంటే మమ్మల్ని దగ్గరకు రానిచ్చి "ఎందుకురాదే-ఊహూ మనం రమ్మనమనడం మరి రాకపోవడమున్నా - ఎన్ని గుండె లుండాలి?" అన్నాడు మా బావ మీసం కొసలను మునివేళ్ళతో తాకుతూ. "ఇక్క డెవ్వరూ దొరగార్ని చూచి హడలిపోవడం లేదులెండి" అంటూ సన్నగా మూతి విరుస్తూ ఆయనకు సమాధానం చెప్పి "రా రా ఆయన మాటల కేంలే-ముందు లోపలకు పద. వెళ్ళి స్నానాల గదిలో వేడి నీళ్ళున్నాయి. ముఖం కాళ్ళూ చేతులూ కడుక్కొని రా" అన్నది నాతో.

మా అక్కయ్య కాఫీ యిస్తే మా అల్లుడు "మామయ్యా ముందు ఈ బిస్కట్లు తిని ఆ తర్వాత తాగ" మన్నాడు. కాఫీ త్రాగుతుండగా టిన్ను మూత తీసి "ఓ సిగరెట్టు కూడా ముట్టించుకొన్నావా మహ దివ్యంగా ఉంటుందోయ్" అన్నాడు మా బావ. "ఆ పాడు అలవాట్లన్నీ మీకుగాని మా తమ్ముడికేం లేవు" అన్నది మా అక్కయ్య. కాఫీ తాగంగానే నా తలంటి ప్రయత్నం మొదలు పెట్టిందది.

"ఏమోయ్ ఈ పూట భోజనాలు ఉన్నాయా లేవా ఎంతసేపు మీ తమ్ముడికి తలంటి-అయినా ఒక్కసారే తెల్లబడి పోడులే-ఓహోహో అదా సంగతి ఇప్పుడు తెలిసిందిలే- మా చెల్లెల్ని యిచ్చి చేసుకుందామని చూస్తున్నావు కాబోలు" అని మా బావ స్నానాల గది దగ్గరకు పనివేళావచ్చి. అని వెళుతుంటే మా అక్కయ్య వెంటనే అందుకొని "పదివేలిచ్చినా మా తమ్ముడేం చేసుకోడు. మాకేం అక్కర్లేదు లెండి. అది ఒట్టి గడుగ్గాయ్" అన్నది.

భోజనాలప్పుడు మా బావ వంటావిడతో "మా బావమరిదికి చాలా భిడియం, కాస్త అడిగి కను క్కొండి. సరిగా అడిగి వడ్డించకపోతే కడుపునిండా తినడు- అందుకే అల్లా బక్కగా తయారవుతు న్నాడు" అని అంటే మా అక్కయ్య "పోనీలెండి వాడు బక్కగా అవుతుంటే మీరూ మీ చెల్లెమ్మా అద్దం........" అని అనేసి నవ్వింది.

మా బావ కొంచెం లావు అయినమాట నిజమే కాని రెండో వ్యక్తి విషయం అంత నిజంకాదు. అయినా మా బావ ఎందుకో ఏమీ అనకుండా ఊరు కొన్నాడు ఒక్క క్షణం.

మా అక్కయ్య నాకు ఇష్టమని గారెలూ, మా బావకోసరమని సొజ్జప్పాలూ చేయించింది. మా అల్లుడికి చేగోడీలు తాను స్వయంగాచేసింది. పంతం పట్టి నాకు మరో రెండు సొజ్జప్పాలు వేయించాడు మా బావ. కుఱ్ఱవాడు- వాడికీ పంతమే. ఇన్ని చేగో డీలు తెచ్చి విస్తట్లో వేసి తింటేనేగాదు వీల్లేదంటూ ఎంగిలిచేత్తో మొండి మొలతో నా ముందు కూర్చు న్నాడు. ఆ పూట భోజనం కొంచెం బరువయ్యింది.

ఓగారె వదిలేసి లేచి వెళ్ళి చెయ్యి కడుక్కొ న్నాను. "మీరిద్దరూ కలిసి వాణ్ణి ఆగారె ముట్టుకో నివ్వలేదుగదా" అంటూ మా అక్కయ్య నెమ్మదిగా అంటే "ఎందుకే సణుక్కొంటావూ- రాత్రికి రేప టికి పెట్టుకొందువుగాన్లే బెంగపెట్టుకోకు- లేకపోతే ఒక పనిచెయ్యి- చిక్కం...." అని నవ్వుతుంటే

మా అక్కయ్య "వాడికెందుకూ ఓ రెండు రోజుల్లో మీ చెల్లాయి వస్తుందిగా- ఉంచుతాన్లెండి" అన్నది. నన్ను అసలు మాట్లాడనివ్వలేదు.

సాయంత్రం అయిదయినాకూడా ఇంకా భుక్తాయాసం తీరిందో లేదో అని అనుమానంగా ఉన్నది. "చూడూ మీ తమ్ముడు మాంచి ఆకలిమీద ఉన్నాడు. ఆ గుక్కెడు టీ నీళ్ళు ఏమూలకి వస్తాయ్. లోపలకు తీసికెళ్ళి తాపీగా ఏంకావాలో అడిగి పెట్టించు" అన్నాడు మా బావ తను ఖాళీచేసిన టీ కప్పు బల్ల మీద పెడుతూ.

"మరి మీసంగతో" అని మా అక్కయ్య అంటే "ఆయనకా అబ్బేవద్దు- ఒక్క సొజ్జప్పాలు తప్ప- ఆవారా ఈవారా అందులో లాగేస్తారు" అన్నాన్నేను.

ఆరు గంటలకు మా అల్లుడు తనతోపాటు అన్నానికి రమ్మంటే అబ్బే ఆకలిలేదన్నాను.

అంతా అట్లా అన్నవారే. కాని తర్వాత ఏడు గంటలకు మేం అందరమూ మామూలుగానే భోజనాలు చేశాం.

ఆపూట మొదటి ఆటకు సినిమాకు పోదామని అనుకొన్నాం గాని "మొదటిఆట రద్దీగా ఉంటుంది- వద్దు- అంతగా అయితే రెండో ఆటకు వెళదాంలే" అన్నాడు మా బావ. భోజనాలయ్యాక ఇక ఆ ప్రసక్తి తీసుకొని రాలేదు. మా అల్లుడు నేను తెచ్చిన క్రొత్త లాగూ, క్రొత్త చొక్కా తొడుక్కొని వాటితోనే నిద్రపోయాడు.

ముందు వరండాలో మా బావ పడక కుర్చీలో నడుంవాల్చి సిగరెట్టు ముట్టించి నెమ్మదిగా లోకాభిరామాయణం మొదలు పెట్టారు. మా అక్కయ్య లోపలకు వెళ్ళి నౌకర్లకు, వంటమనిషికీ ఇంటికిపట్టుకు పోయేందుకు పిండివంటలవీ సర్ది ఇవ్వడం మొదలైన చిల్లర పనులన్నీ చూచుకొంటున్నది. "ఆ గారెలు అల్లా ఉంచెయ్యండి" అని ఒకటి రెండు సార్లు అనడం మాకుకూడా వినిపించాయి. అది విని మా బావ "చూచావుటోయ్ మీ అక్కయ్యకు నీ మీద ఎంత ఆపేక్ష!" అన్నాడు. నేను ఉరుకోక "నా కోసం కాదయ్యా- రేపో ఎప్పుడో వస్తుందటగా మీ చెల్లెలు అందుకూ. అది సరేగాని- స్కూలు పరీక్షలే కదా పోనీ వచ్చేయక పోయిందీ....పైగా దగ్గర కదా-మరి నా విషయంలో అంత హడలగొట్టిన వాడివి చెల్లెలు విషయంలో...." అన్నాను. నేనుమాటపూర్తిచెయ్యక ముందే మా అక్కయ్య మా దగ్గరకు వచ్చి మా సంభాషణలు విన్నది కాబోలు "ఇవన్నీ మన దగ్గరేరా-అక్కడ సాగవు-అది ఈ అన్నగారిగారాలపట్టి-కొండమీదికోతి కావాలన్నా సరే తెచ్చి ఇవ్వాలసిందే" అన్నది. "నిజమే - నువ్వన్నమాట అట్టే అబద్ధం కాదు. అయితే చూచావ్- ఆ విశాఖపట్నపు కొండ మీదిది కావాలంటుందేమోనని భయంగా ఉన్నది" అని నా వంక తిరిగిచూచి పెద్దగా నవ్వేశాడు మా బావ.

ఛలోక్తులతో, ఉక్తి ప్రత్యుక్తులతో గడిచిపోయింది చాలా సేపు.

నాకు మధ్యాహ్నం తిన్నవే సరిగా అరగలేదు. పైగా రాత్రి భోజనం. అందులో గారెలు ఒకటి రెండు ఎక్కువ తిన్నానేమో. కొంచెం వెగటనిపించినా తినేశానేమో బరువుగా ఉన్నది. "రేపు ప్రొద్దుట కడుపునొప్పి వస్తుందేమో" అనుకొని భయపడ్డాను.

వీధివాకిలి గడియ వెయ్యబోయే సమయంలో మాధాకవళం కేక వినిపించింది. పొమ్మంటే పోలేదా పిల్ల. గట్టిగాచెప్పి గడియవేసి వద్దామని మా అక్కయ్య అటు వచ్చింది. "పండగ్గదమ్మగోరూ ఇంత వణ్ణం పడెయ్యరా" అంటూ ఆ పిల్ల ఎంతకూ వెళ్ళకపోతే "ఈ వచ్చేదేదో కాస్త ముందుగా రాలేక పొయ్యావ్" అని కొంచెం కోపగించుకొని మాఅక్క లోపలకు వెళ్ళింది. నేనూ దానివెనక లోపలికి వెళుతూ "పోన్లే అక్కయ్యా ఏదో చూచి కాస్త పడెయ్యి- పండగపూటా మరీ లేదనకూడదు కదా" అంటూ సర్దిచెప్పాలని ప్రయత్నం చేశాను. "నిజమేరా- మరి వాళ్ళు తలాకాస్త పట్టుకెళ్ళారు కదా" అంటూ మా అక్కయ్య గిన్నెలు మూతలు తీసి చూచింది. చూచాక దానికి కోపమూ, చిరాకూ తగ్గాయి, ఓ వెండి పళ్ళెంలో ఇంత అన్నం

పెట్టుకొని మిగిలిపోయిన కూరలూ పచ్చడీ దానిపైన పేర్చుకొని బయలుదేరి వెళుతుంటే నేను స్వతంత్రించి బుట్టలోంచి రెండుగారెలు తెచ్చి ఆ పళ్ళెంలో వేశాను. "అదేమిట్రా" అంటున్నట్లు మా అక్కయ్య నావంక చూచింది. "పోన్లే అక్కయ్యా - పండగపూటా ఒక్కగారె వేస్తే నీకే పుణ్యం - వద" అన్నాను. "నీ ధర్మచింతన మరీ బాగుంది. గారెలు వేస్తేనేగాని పుణ్యంరాదా ఏమిటి? ఏదో నీకిష్టమని ఓనాలుగు ముక్కలు అట్టేపెట్టి ఉంచితే అందులో రెండు దానం చెయ్యడమా" అంటూనే పళ్ళెంలో ఉంచినవి మళ్ళీ తియ్యడం ఇష్టంలేక ముందుకు సాగింది. మరో అప్పుడయితే అల్లా అనేది కాదు మా అక్కయ్య. పసివాళ్ళకూ వంటావిడకూ సొజ్జప్పాలూ అవీ పంచి ఇవ్వగాలేంది ఓరెండు గారెలు ఇక్కడవేస్తేమాత్రం ఏం - అది కాదు. దాని ఆలోచన వేరు.

నేను మా అక్కయ్యవెంట మళ్ళీ వీధి గుమ్మం దగ్గరకు వచ్చాను. దానికి తోడుగా ఉంటూ, దానితో మాట్లాడుతూ, అది మాట్లాడుతుంటే వింటూ అక్కడ ఉన్న నాలుగురోజులూ దాని వెంటే తిరుగుతూ, గడపడం నాకు చిన్నప్పట్నుంచీ అలవాటు.

★ ★ ★

ఆపిల్ల జోలె పట్టింది. అన్నం కూరా పచ్చడీ జోలెలో వేశాక ఆ జోలెలో కలగా పులగంగా ఉన్న మిగతా పదార్థాలతో కలిసి పోకుండా ఆరెండు గారెలూ కాస్త విడిగా వేసింది మా అక్కయ్య.

ముఖంమీద పడుతున్న చింపిరిజుట్టు వెనక్కు నెట్టుకొని ఆపిల్ల ఆ రెండుగారెల్నీ ఆప్యాయంగా స్పృశిస్తూ తల ఎత్తి ఎంతో ఆశ్చర్యంగా మా అక్కయ్యవంక చూచింది. కలిగిన ఆనందాన్నీ, కృతజ్ఞతనూ ఆ వెఱ్ఱిచూపులోనే మహ విచిత్రంగా, గొప్పగా వ్యక్తంచేసిం దాపిల్ల. అంతలో అటుతిరిగి మాకు కొంచెం దూరంగా లాంతరు స్తంభం దగ్గరగా నిలబడ్డ తండ్రితో, పెద్దగా "అయ్యా ఈడ అమ్మ గోరు గార్లేసిందే" అని కేకవేసి చెప్పింది. ఆపిల్ల కేకవిని అతను నెమ్మదిగా కఱ్ఱ నేలకు తాకిస్తూ మా వీధి అరుగుదగ్గరకు వచ్చి అరుగు అంచున కూర్చున్నాడు. ఆపిల్ల పట్టరానిసంతోషంతో తండ్రితో ఆ విషయమే మళ్ళీ చెప్పింది. చెబుతూ జోలె అతని చేతికి దగ్గరగా తీసికెళ్ళి, తన రెండో చేత్తో తండ్రి చెయ్యి పుచ్చుకొని అతని చేతివేళ్ళకు ఆ గారెలు తగిలేలాగున చేసింది. అతను "అవునే" అని ఓక్షణం తర్వాత "నువ్వు తిందువుగాన్లే అమ్మా. ఇంటిది పొయ్యాక నీకు వలారం చేసిపెట్టినోళ్ళేరు న్నారు? పైగా రెండేళ్ళనుంచీ కళ్ళుజబ్బు ముదిరి పాయె. అప్పటాలనుంచీ కళ్ళు అసలే ఆపడక పొయ్యె-నీకేం తెచ్చిపెట్టకపోతిని" ఏదో సణుగు తున్నా డాముసలాడు. "నువ్వొకటి తిందువుగాన్లే అయ్యా-రెండూ నాకెందుకూ ఇంకా బోలెడుబువ్వుండె గందా" అంటోంది ఆపిల్ల.

నేవింకా అక్కడే నిలబడిపొయ్యాను. మా అక్కయ్యకూడా అట్లాగే నిలబడిపోయింది. గుమ్మం క్రిందుగా అరుగు ప్రక్కన నిలబడ్డ ఆ పిల్ల మా విషయమే మరిచిపోయినట్లున్నది. తండ్రితో ఏదో మాట్లాడుతున్నది.

ఒక్క నిముషం క్రిందట ఆ పిల్ల-చింపిరితల ఎగరేస్తున్న ఆ పిల్ల, చినిగిన పరికిణీ, ఓణీలు వేసు కొనే ఈడు ఎప్పుడో వచ్చినా తప్పనిసరై మాసికలు కుట్టిన రవిక తొడిగిన ఆ పిల్ల అన్న మాటలు.... ఆ మాటలే నా చెవుల్లో యింకా ప్రతిధ్వనిస్తున్నాయి. ఎప్పటికప్పుడు క్రొత్తగా, అదే మొదటిసారా అన్నంత క్రొత్తగా విన్పిస్తున్నట్లు అనిపించింది. "ఏమి బీదరికం! ఈ పాడు బీదరికంలో రెండు గారెలు కంటపడేసరికే ఎంత సంబరం!" పేదరి కాన్ని గురించి ఆలోచిస్తున్నాను. మా పెద్దక్క పెళ్ళికి మా నాన్నగారు "గొప్ప డిన్నరు" ఏర్పాటు చేశారు. విందుభోజనా లయ్యాక రెండు రోజులదాకా పిండివంటలు అందరికీ పంచిపెడుతూనే ఉన్నారు మా యింట్లో. అప్పటి విషయం ఒకటి నాకు ఇప్ప టికీ జ్ఞాపకం ఉన్నది. "అన్ని గారెలు చేయించారు.

బట్టలలో మిగిలిపోయాయి" అని సాధిస్తూ, "ఏం చేయ్యమన్నా రవన్నీ - పంపవలసినవా ళ్ళందరికీ పంపాను. ఇప్పటికే రెండురోజు లయ్యింది. పిల్లలు అవి తిని జబ్బులు తెచ్చుకోగలరు-మీ పెద్ద కొడుక్కు అప్పుడే అజీర్తి పట్టుకొన్నది - అవన్నీ ఏం చెయ్య మంటారో చెప్పండి" అని ఒకటికి రెండుసార్లు మా అమ్మ అనేసరికి మా నాన్నగారికి కోపంవచ్చి "దిబ్బమీద పారేయించు" అన్నారు. మా తాతగారు అడ్డుపడి తరణోపాయం చెప్పిఉండకపోతే మా నాన్నగారు అంతపనీ చేయించేవారే. మా తాతగారు అప్పుడు ఏం ఉపాయం చెప్పి ఉంటారో అని ఆలో చిస్తూ మా అక్కకేమైనా తెలిసి ఉంటుందేమో దాన్ని అడుగుదామనుకొని దానివంక చూచాను. అదీ ఏదో ఆలోచనలో మునిగి ఉన్నది. ఏ మాలోచిస్తు న్నదో నాకైతే వెంటనే తెలియరాలేదు కాని దాని వాలకంబట్టి చూస్తే ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నట్లే అనిపించింది. చివరకు నేనే "ఏమిటే అక్కయ్యా అంతగా ఆలోచిస్తున్నావ్?" అన్నాను. అది నెమ్మ దిగా "ఏం లేదురా చూశావూ. తల్లి లేకపొయ్యేసరికి ఆ పిల్ల-వెధవ గారె ముక్కక్కూడా ఎంత కరువ్వాచి పోయిందో!" అన్నది. దాని ఆలోచన అటు పోయింది. అంతలో మళ్ళా అందుకొని మా అక్కయ్య "మరీ ఆడపిల్లల విషయంలో-ఆ విషయం ఇట్టే పట్టేయచ్చురా" అన్నది.

క్రింద ఆ పిల్ల తండ్రి నోటికి ఓ గారె అందించి తినమని బలవంతం చేస్తోంది. అతను "వద్దే- నీకు ఉంచుకోవే మీ తల్లేనా ఉంటే ఇంటికాడ అది చేసి పెట్టుకొంటదిలే అని నేను తిందును...." అంటూ వణుగుతూ ఆ గారె నోటికి తగలనీయకుండా తల తిప్పేసుకొంటున్నాడు.

వాళ్ళిద్దర్నీ చూస్తూ అల్లా ఉండిపోయాను. నాకు తెలియకుండానే నాలో ఏదో పొంగువస్తున్నది. ఆ దృశ్యం నన్ను ఎందుకో- ఎందుకో స్పష్టంగా చెప్ప లేనుగాని కదలించి వేసింది. ఎదురుగా ఆ వెఱ్ఱిపిల్ల చింపిరితలతో, చినిగిన బట్టలతో అసహ్యంగా ఉన్న ఆ పిల్ల, తండ్రిని ఆ గారె తినమని బ్రతిమిలాడుతున్న ఆ బీదపిల్ల కొంచెంసేపు తర్వాత నాకు కన్పించ లేదు. ఏమో అంటున్న ఆ ముసలితండ్రి మాటలు నాకు విన్పించలేదు.

పంచకొంగులతో కళ్ళు గట్టిగా తుడుచుకొన్నాను. ఆ తండ్రీ కూతుళ్ళమధ్య వంతెనలా ఉండవలసిన ఆ బీదదాన్ని గురించీ వాళ్ళ దారిద్ర్యాన్ని గురించీ ఆలోచిస్తున్నాను. "ఈ బీదపిల్లకు వెధవరెండు గారెలు ఇంత ఆనందాన్ని కలిగింప కలిగాయి కదా" అను కొన్నాను. "నాకు గారెలు ఆ పూట ఎంతో వెగటని పించాయి కదా" అనుకున్నాను. అల్లా అనుకుంటూ గబగబా లోపలకువెళ్ళి గారెలబుట్ట బుట్టబుట్టా పట్టు కొచ్చి ఆ పిల్ల జోలెలో గుమ్మరించేశాను. ఆ పిల్ల "ఏందండోయ్- ఏందిది?....కోపంవచ్చిందా ఏంటి?" అంటూ దిమ్మరపోయి నా వంకచూస్తూ నిలిచి పోయింది. మరుక్షణంలో మా అక్కయ్య వంకకు తిరిగి "అమ్మగారూ చూశారా!" అంటున్నట్లు చూచింది. నేనూ మా అక్కయ్యవంక చూచాను.

మా అక్కయ్య గుమ్మానికి ఆనుకొని నిలబడి ఉన్నది. దాని కళ్ళవెంట ధారలు కడుతున్న కన్నీరు నాకు స్పష్టంగా కన్పించింది. మా అక్కయ్య నెమ్మ దిగా "పట్టుకెళ్ళమ్మాయి. వాడికేం కోపం రాలేదులే- మిగిలిపోయినయ్యాని మా తమ్ముడు నీకు కావాలనే ఇచ్చాడు. తీసుకెళ్ళు, ఇంటికివెళ్ళి మీ అయ్యకుపెట్టి నువ్వూ తినమ్మా- వెళ్ళు- వెళ్ళుపిల్లా" అన్నది. దాని గొంతులో వచ్చిన మార్పుగాని, దాని కన్నీరు గానీ ఆ పిల్ల గమనించే అవకాశం లేకపోయింది.

ఆ పిల్ల తండ్రి చెయ్యి పుచ్చుకొని, బరువైన జోలె ఊగించుకొంటూ నెమ్మదిగా ముందుకు బయలుదేరి వెళుతూ, అంతలో వెనక్కి తిరిగి ఏదో జ్ఞాపకం వచ్చినదాన్లా, పెద్ద నావసాన్లాగా ముఖంపెట్టి మా అక్కతో "మీ తమ్ముడుగోరు ఇవన్నీ మాకెట్టేశా రని మరి మీ అమ్మగోరు కేకలేస్తుందేమో" అన్నది ఏదో భయపడుతూ. అల్లాఅని ఆ పిల్ల కొంచెం గబగబా అడుగులువేస్తూ ముందుకు వెళ్ళిపోయింది.

ఆమాటకు మాఅక్కయ్య దుఃఖం అపుకోలేక వెక్కి వెక్కి ఏడ్వడం మొదలుపెట్టింది. "అదేమిటే- అక్కా- దుఃఖాన్ని అంటూ నేనూ ఒకవంక పొంగి వస్తున్న ఆవేశాన్ని అణచుకొంటూ దాన్ని సముదాయింప బోయాను. ఆ పిల్ల దారిద్ర్యం తను చూడ లేకపోయింది కాబోలు అనుకొంటూ "ఊరుకోవే అక్కయ్యా" అంటుంటే మా అక్కయ్య చీర కొంగు నోట్లో కుక్కుకొంటూ "పిచ్చిపిల్ల-ఆ పిల్లకు తెలీదుకదా మనకూ..." అని ఇంక చెప్పలేక పోయింది.

నా స్థితి మరీ అయోమయ మయిపోయింది. "ఊరుకోవే అక్కయ్యా నీదంతా మరీ పిచ్చి" అని అంటూ సముదాయించడానికి ప్రయత్నం చేస్తుండగా లోపల్నించి "ఏం చేస్తున్నారర్రా ఇక్కడ?"అంటూ మా బావగారు మేం నిల్చున్న గుమ్మందగ్గరకు వచ్చారు.

మా యిద్దర్నీ చెరో చెయ్యి పుచ్చుకొని లోపలకు తీసుకొని వెళ్ళాడు మా బావ. విషయం తెలుసుకొని ఒక్కక్షణం ఆలోచనలోపడి అంతలోనే కొంచెం కోపం నటిస్తూ "అక్కా తమ్ముడూ మరీ అంతకంతకు చిన్నపిల్లలయిపోతున్నారు" అని కేకలేశాడు. హడావిడిగా కొంతసేపు అటూ ఇటూ తిరిగాడు. మా అల్లుణ్ణి నిద్రలేపి వాడికి చల్లగాలి తగలకుండా ఉండేందుకు కోటు వెయ్యమన్నాడు. అంటూ తాను దొడ్లోకి వెళ్ళి బండీ వాణ్ణి లేపి బండి సిద్ధం చెయ్యమన్నాడు. ఒక్క నిముషంలో దొడ్లోంచి తిరిగి వస్తూ మా అక్కను పట్టుచీర కట్టుకోమన్నాడు రైలుకు పోతున్నంత హడావిడిచేసి మమ్మల్ని ఉన్నపళంగా బయలుదేరతీసి సినిమాకు తీసుకొని వెళ్ళాడు.

బండీలో కూర్చున్నాకూడా మా అల్లుడికి ఇంకా నిద్రమత్తుగానే ఉన్నది. "ముఖం కడుక్కోవాలి మామయ్యా- పేస్టు ఏదీ?" అన్నాడు. తను నిద్ర లేచాడు కనుక తెల్లవారిందనీ, తెల్లవారింది కనుక వెంటనే పళ్ళు తోముకోవాలనీ పట్టుపట్టాడు. వాడికి నచ్చచెప్పేందుకు చాలాసేపు పట్టింది.

కుఱ్ఱవాడు - ఇంతలేడు - వీడికూడా అప్పుడే దర్జా - పేస్టు - పేస్టు కావాల్ట" అనుకొని నేను కావాలని నవ్వుకొన్నాను. సినిమాకు వెళ్ళి, మూడు గంటలు అక్కడ కాలక్షేపంచేసి సినిమా కొన్నిచోట్ల బాగాలేదనీ, కొన్ని దృశ్యాలూ, కొన్ని నాట్యాలూ బాగున్నాయనీ కబుర్లు చెప్పుకొంటూ ఇంటికి తిరిగి వచ్చాక కాని మా అక్కయ్యా నేనూ మామూలు మనుష్యులం కాలేక పోయ్యాము. మొత్తంమీద మా బావగారి ప్రయత్న మానాడు సఫలం అయ్యింది.

★ ★ ★

ఇది జరిగి ఎన్నో ఏళ్ళయింది. అసలు జరిగిందో లేదోకూడా జ్ఞాపకం రాకుండా పోవలసినంత కాలం గడిచిపోయింది. కాని....

ఇప్పటికీ గారెలు నా కంటపడినప్పుడల్లా నాకు ఆపిల్లమాటలు జ్ఞాపకం వస్తాయి. ఆ మాటలే నా చెవుల్లో గింగురు మంటాయి. అప్పటినుంచే — అనుకొంటాను నాకు గారె అంటేనే భయం. ఎందుకో దాన్ని దగ్గరకే రానియ్యను. దాని మూలకంగా ఏవేవో జ్ఞాపకం వస్తాయని భయం కాబోలు- కాబోలు నాకైతే ఖచ్చితంగా తెలియదుకాని - మొత్తంమీద అప్పట్నుంచే అనుకొంటాను నాకు గారె అరగదు.

విశ్వనాథ వేంకటేశ్వర్లు | హంసోత్క్రమణము

అల బృందావన గోపికారమణ కా
వ్యానంద దివ్యాపగా
జలకేళీ ప్లవమాన దివ్యకవిహం
సం బుత్క్రమం బంది వి
ర్మల సత్యాది మహోర్ధ్వలోక తతులన్
మన్నించుచున్ వాఙ్మనః
కలనాతీత మఖండ మద్వయ పదా
క్రాంతిన్ విడంబించుచున్.

కవి ఋషభులు దేవతలున్
బ్రవిమల సత్కర్మఫలము పట్టుగఁ దత్త
త్సువిశాల పదవిరాజిత
వివిధర్షి సమూహ ముద్దవిడి జేపెట్టన్.

తమిఁ గుబుసంబును విడిచను
కమనీయాహి ప్రభుండు కైవడి బ్రాంతి
ప్రమితికృత దేహ యష్టిక
విమృష్టబోధమయ వహ్ని వేల్చుచుఁ జనియెన్.

నానాపుష్ప సువాసనాభరితమై
నాకౌకసుల్ క్రందుగా
సోనల్ జార్చిన పుష్పవృష్టి యొలపెన్
శోభానటద్గాయనీ
శ్రీ నవ్యస్వన మొప్పె మింటఁ ద్రినగ
శ్రీ వాఙ్మహేశుండు వి
ద్యానూత్నాంబుజసూతి పోతన కృతో
ర్ధ్వప్రాణితంబోవుచోన్.

సూక్ష్మరూపులు నానంద శుద్ధమూర్తు
లాదికవి నన్నపార్య ముఖ్యాంధ్రకవులు
దేవతర్షి పురస్సరుల్ దివ్యగీతి
ముఖులు బమ్మెరకవిరవిఁ బొగడికొనిరి.

ఆదికవి నన్నపార్యుం డిట్లాశాసించె.

అక్షరమ్మునగల రహస్యమ్మెఱింగి
మాటయొద్దికలోనున్న మాధురిగని
పలుకుపలుకున శారద నొలుకఁబోసి
బృంద మింటికిఁ జేర్చిన వీరుఁడితఁడు.

ఉభయకవిమిత్రుండైన తిక్కన యిట్లు వాక్రుచ్చె.

ఊహాయురి మిన్నుముట్టి దిగ్వ్యోమపూర్ణ
రసమహార్ణవమౌ బృందరాసకేళి
ప్రేతలను వెన్నునింగూర్చు విశ్వవిభృత
బ్రహ్మ గాంధర్వగీతికి బ్రహ్మ యితఁడు

కవిలోక సార్వభౌముండైన శ్రీనాథుం డిట్లనియె.

బొడ్డువల్లెమ గొడ్డేఱి మోసపోతి
తెలిసితిని బావ బ్రాహ్మికై చిలుకయంచు
భావకారణ సామగ్రి పటలిఁ ద్రవ్వ
మిగిలి మగులని జ్యోతిప్రమేయ మనియు.

భావాధిదైవతంబు లిట్లానందించిరి.

ఊర్ణనాభంబుగతిఁ దన యుల్లమలము
మమ్ముప్రేతలఁ గృష్ణుని మఱుగవెలిచి

కవికిఁ గవితకు దృగ్దృశ్యకలనఁ గూర్చి
ద్రష్టయై వెల్గె బంధవినష్టి నంది.

రసాధిదేవత లిట్లు తన్మయత్వంబు గనిరి

విశ్వహృదయ పూర్ణ విమలరసాబ్ధికి
గట్టువేసె నితడు కావ్యసృష్టి
పొంగివచ్చు బ్రహ్మభూయాస్త్వమున కితం
డవధియయ్యెఁ గేవలాత్మసత్త

ప్రబంధదేవత లిట్లని పూజించిరి.

విశ్వబంధానుగతమైన వెలుగుదారి
రాచి జీవైక్యభావ సామ్రాజ్య పట్ట
బంధ భాసురుఁడై మించె భావబంధ
మాశ్రయాశాభ భావంబునందు వేర్చి

వాగ్దేవత లిట్లు వర్ణించిరి.

నాకు గర్వమురలు నాదాంత రేఖయే
వ్యాసమొంది యమున పడవ తెప్ప
నేకశిలపు పొలములెక్కు రసాపగ
లీనమొందెఁ గృష్ణవేణుగీతి.
వైఖరీ గర్వితత్వరా వాగ్విభూతి
నణువు నణువున గదియించు నమృతమూర్తి
శబ్దగత సత్తతానయై శాశ్వతాత్మ
రూపుఁడై నామరూపముల్ ద్రోసెనితఁడు.

కర్మదేవత లిట్లు వ్యాఖ్యానించిరి.

హలముకొల వెల్గు చిన్మయధ్యాన ధార
క్షేత్ర కర్షణ చాతురీశత వహించి
భాగవత యజ్ఞ జయమాన భాగ్య గరిమ
రవ మహావభృథస్నానరమ్యు డితడు.

భక్తిదేవత లిట్లు పరవశత్వంబు గనిరి.

మున్ను ప్రహ్లాద నారద ముఖ్యులైన
భక్త హృదయానురక్తయై పరిఢవిల్లు

చిన్మయ జ్యోతి గోపికాశ్రేణి చరణ
నర్తనానుగమై యిట్లు నాట్యమాడె.

జ్ఞానదేవత లిట్లనువదించిరి.

తన్ను తానుగ మిగిలించు తనదు నెఱుక
తానుగానుండి తనలోని తాఱుమాఱు
తెరకు నవ్వలఁ దిల్లిక తెలుఁగు దాల్చు
వెలుగె యీతెల్గుకై సరుఁ దెలిమి విలువు.

పంచభూతంబు లిట్లని ప్రశంసించె.

అయొదలన్ వసించితిమి
హాయిగఁ బందన కోటరంబునన్
మాయని గంధమట్టులు సు
మాళపు చిన్మయ గంధవాసనా
ప్యాయతఁ దన్మయీభవన
భాగ్యము నంది తదేక తాన వృ
త్త్యాయతి నందె నన్నగిలి
నట్టుల యీచు లయించినారమున్.

సూర్య చంద్రు లిట్లు కైవారంబు లొనర్చిరి.

కాల సంకర్షణత వెల్గి కంటిజంటఁ
గుడియెడమలందు నెడఁదలోఁ గూడిమాడి
యమృత ధారాస్నపక పరివ్యాప్తవృత్తి
హ్లాదవృత్తిని గంటి మాయంగయష్టి.

దేవత లిట్లు కీర్తించిరి.

జననంబు స్థితియు లయమునఁ
జను వృత్తులను దృక్ప్రసారిత గనుచున్
జననాదు వెలుగకుండిన
మనీషి యిట్టి స్థితిగలదె ; మఱియెందేనిన్.

ఋషు లిట్లు నిగమించిరి.

అయమర్థమతిశయములు చి
న్మయు డీ కవిలోకమణియు, మాదృశులు స్వ

త్త్వయనంబుల నావశ్యత
వ్యయించు నీవి వెలుఁగుదేఱు వర్త్మములందున్

శారదాదేవి యిట్లు ముచ్చటపడియె

నాబిడ్డ వీడు వీనికి
సాబాలుగ నొందె శబ్ద సామ్రాజ్యంబుల్
శ్రీబంధుర చిద్గగన
వ్యాబద్ధ మరాళ మదియు వర్తిలుఁ దానై.

శారదాదేవి యిట్లాదేశించినంత

కలనీలకంఠ కేకా
కులనిస్వాన మ్మొకండు క్రోల్చినయట్లై
విలసద్బృందావన గో
కుల వేణూదితరవంబు కొసరినయట్లై.

ఒక నినాదమేచె నుర్వియు నాకసం
బొద్దిగిలిన మాద్రి నోమితి మహ
నీయ రవము వెలసి నిండె సర్వత్రైక
భాసమానరేఖ పరిఢవిల్ల.

శబ్దమునుగాను దద్ధర్మ శక్తిగాను
వ్యంగ్యమునుగాను ధ్వనన వైభవముగాను
రసమునుంగాను చేతసాశ్రయముగాను
గానుగా నేను నేదియు గాను నేను

కవినిగా నేను, భక్తుఁడఁ గాను కాను
మఱియు బుద్ధికంద కఱదలెన్ని
యన వినగరాని యాయెది యదియ నేను
హా ఉహా ఉహా ఉహా ఉహా ఉ

ఓమి త్యహమితి వాచో
వ్యోమచర ద్ధంస మేను వ్యాధావ్యాధ
ప్రామాణ్యగతి వివర్తిత
సామాద్వైతప్రమాత్ర శ్రౌతఖగంబున్.

నిగమనము :

కవి హంసప్రభుడైన పోతన జగ
త్కల్యాణకార్యంధ్ర భా
గవతోదార మహాధికార రచనా
కార్యంబు పూరించి యీ
భవముంద్రోసి యఖండ చిన్మయపద
వ్యాప్తిఁ స్వరూపాత్మవై
భవుడై పోవు సుదీర్ఘఘోషమని సం
భావించి రాత్మజ్ఞులున్.

# విమర్శకులు - విమర్శనము

కేతవరపు రామకోటిశాస్త్రి

సాహిత్య విమర్శకులని అనుకొనబడు వారందరును అసలు విమర్శకులు కారు. మూడు వంతులకు పైగా ప్రచారకులు. మిగిలిన ఆ ఒక వంతులో క్షత విమర్శకులని (imperfect) అక్షత విమర్శకులని (perfect) ఇరు తెగల వారు కలరు. అక్షత విమర్శకులే అసలు విమర్శకులు. అందరను కలిపి అవిచారణముగా విమర్శకు లనుకొనుట సాగిపోవుచున్నందున పై విధముగా విడదీయవలసి వచ్చినది.

ప్రచారకున కే గ్రంథమున కా గ్రంథము మహాకావ్యము. ఏ కవి కా కవి మహాకవి. సాహిత్యమును ప్రక్రియావైవిధ్యముతో ఏకాగ్రతకు తెచ్చుకొని అంతస్సత్వము నెరిగిన తెలివి వాని కుండదు. ఉండకపోవుటను బట్టియే అతడు ప్రచారకు డైనాడు. అతని ధోరణిలో ప్రధానముగా కనిపించునవి గ్రంథములోని కథను తిరిగి తన మాటలలో చెప్పుచు మధ్య మధ్య వీలైనన్ని పద్యముల నుదాహరించి వాని యర్థ తాత్పర్యములను విశదపరచుట. సర్వజన విదితములైన లాక్షణికపు పడికట్టురాళ్ళతో జోడించి మచ్చు పద్యములని కొన్నింటిని చూపుట. అస్పష్టములును - అనావశ్యకములును ఐన విశేషణములతో శైలి విషయమును స్పృశించుచు అందుకు కొన్ని పద్యము లుదాహరించి సహృదయులైన పాఠకశేఖరు లీవిషయము నెరుగగలరని చేతులు జోడించుకొని వినయము నభినయించుట—ఈ రకమువారి రచనములు అతిసాధారణపు జనుల కుద్దేశింపబడిన బజారు సాహిత్యోపన్యాసములవలె నుండునన్న మాట. వీరి యవసరము లేదని చెప్పబోవుట లేదు. వీరి యవసరము దేశమునకు చాలయున్నది. వీరి పద్ధతి ప్రారంభకుల కుత్సాహమును ఉపదేశమును కలిగించు శక్తి గలది. సాహిత్య మతిత్వరితగతిని వ్యాపించుటకు దిన పత్రికలలో వార్తలవలె వీరి రచనలు, ఉపన్యాసములు అధిక సంఖ్యలో ఎన్ని వెలువడిన అంతమంచిది. వీరు చేయు నీ పనిని కేవల విమర్శకుడు చేయలేడు.

క్షత విమర్శకుడు ప్రచారకునివలె ప్రతి గ్రంథమును మహాకావ్యమని - ప్రతి కవిని మహాకవియని యనడు. ఈ యనకపోవుట సాహిత్యముయొక్క అంతస్సత్వము నెరిగిన తెలివితో కాదు. అతని కొక గ్రంథము నచ్చును. అది మహాకావ్యము. ఒకటి నచ్చదు. అది కాదు. అతడు కావ్య లక్షణములని కొన్నింటిని అనుకొనును. వానికి హేతువు లుండనక్కర లేదు. అవి ఉన్నది మహాకావ్యము. లేనిది కాదు. పరంపరగా వచ్చుచున్న లాక్షణిక మార్గ మాతనికి తెలియును. ఆ మార్గముయొక్క ఆంతర్యము తెలియనక్కర లేదు. ఆ మార్గమునకైన ఉదాహరణములు లభించిన గ్రంథము మహాకావ్యము. లభింపనిది కాదు. స్వతంత్ర బుద్ధిలేనివాడు క్షత విమర్శకుడు.

ప్రక్రియావైవిధ్యముతో కూడిన సాహిత్యముయొక్క అంతస్సత్వము నెరిగిన తెలివికలవాడును, తాను కావ్య లక్షణము లనుకొన్నవానిని ప్రమాణములచేత సిద్ధాంతీకరించుకొన్న వాడును, లాక్షణిక మార్గముయొక్క ఆంతర్యము తెలిసినవాడును, స్వతంత్రబుద్ధిమై స్పష్టమైన దర్శనము కలవాడును ఐ, ధర్మసర్టియాధికారమును సంపాదించుకొన్నవాడు అక్షత విమర్శకుడు. అనగా అసలు విమర్శకుడన్న మాట.

కవులుగా కాలేనివారు విమర్శకు లగుదురన్న పరమమైన చవుకబారు అభిప్రాయమొకటి వ్యాప్తమైయున్నది. ఇటువంటిదే విమర్శనమునకంటె కవితాశక్తి గొప్పదను అభిప్రాయము—కవులుగా కాలేనివారనగా కవులుగా కావలయునన్న ఆరాటముండి శక్తి లేనివారనిగదా అర్థము-? అనగా తమకున్న శక్తి ఫలానా పని కుపయోగించునన్న జ్ఞానములేనివారన్న మాట. అసలు తమ కేదైన శక్తి ఉన్నదో లేదో కూడ తెలియనివా రందరిని మించినవారు. తమకున్న శక్తి వలానాదాని కుపయోగించునన్న తెలివి లేనివారు కవులగుటకే అవకాశము లేకపోయినపుడు విమర్శకు లెట్లగుదురు ?—ఏపని చేయువానికైనను అందుకు తగిన సత్తా తనకున్నదియు లేనిదియు ఎరుగు నేర్పుండవలయును. కవితాశక్తి తనకులేదని తెలుసుకొన్న తక్షణము విమర్శనాశక్తి వానివెంట బడునాయేమి ? కవులు కాలేనివారు విమర్శకులగుటకు—నేనిట్లందును విమర్శకులుగా కాలేనివారు కవులగుచున్నారు.—ఇదెంత అవివేక మూలమో

అదియు అంతే. తన విద్యచేత, తన లోకానుభవముచేత, తన పరాంకోటి ఊహాశక్తిచేత, తానుద్దేశించిన వస్తుగత భావ తత్వమును వ్యక్తీకరించువాడు కవి. తన విద్యచేత, తన లోకానుభవముచేత, తన పరాంకోటి ఊహాశక్తిచేత, కవి ఉద్దేశించిన వస్తుగతభావతత్వ వ్యక్తీకరణము లోతు లందు కొని అనుభవానందమును పొంది, తదనుభవమును సూక్ష్మ సూక్ష్మముగా ముందువెనుకలమీది దృష్టితో విశ్లథనము చేసి సహేతుకము సత్వవిచారణము జరిపి తత్తత్వ ధర్మ నిర్ణయమును చేయువాడు విమర్శకుడు. కవి కానేని వాడు కాదు విమర్శకుడు - విమర్శనాశక్తి కన్న కవితా శక్తి గొప్పది - నిజము. కవితాశక్తి గొప్పదే. అయితే కవితాశక్తి, కవులందరిలో ఒకే మోతాదులో లేదు. ఒకనిని మించిన శక్తిమంతు డొకడుగా నున్నాడు. ఆ వాని మించుటకైన శక్తి ఎచటనుండి వచ్చినది ? ఎట్లు వచ్చినది ? విమర్శనమునుండి వచ్చినది. అతడు విమర్శకుడగుటవలన వచ్చినది. అందుకే మహాకవులందరును విమర్శకులని చెప్పుట. కవిత్రయమువారికంటె నిస్సంశయముగా కవితా శక్తి సంబంధి ఊహ అధికముగా గలవాడు శ్రీ కృష్ణ దేవరాయలు. కాని ఆయన మహాకవి గాదు. కవిత్రయము వారు మహాకవులు. కవిత్రయమువారిలో నున్న విమర్శకుడు రాయలవారిలో లేడు. అందువల్ల కవితా విమర్శన శక్తులలో ఏది గొప్ప అన్న ప్రశ్న ముదయింపదు. ఆ రెండును అన్యోన్య మాధారాధేయములు. నూటికి అరవైపాళ్ళు కవితా శక్తి గలిగి నలభై పాళ్ళు విమర్శనాశక్తి గలవాడు మహా కవుల కోవలోపె కెక్కినట్లు అరవైపాళ్ళు విమర్శనాశక్తియు, నలభై పాళ్ళు కవితాశక్తియు కలవాడు విమర్శకు డగు చున్నాడు. ఒకప్పు డీ రెండును ఒకే వ్యక్తియందు సమ పాళ్ళలో నుండవచ్చును. సవ్యసాచివలె అతడు రెండింటిని ఉచితరీతి నిర్వహించును. అట్టివాడు కారణజన్ముడు.

ప్రచారకులు విమర్శకులనబడుటను నిరాకరించువారగుట మూలమున వారి విషయ మీవ్యాసమున ఇంకేమియు వ్రాయ తలపెట్టుటలేదు.

ఈ విమర్శకులకు నచ్చినది మహాకావ్యము. ఈ నచ్చుట కవి హృదయమునకు సంబంధించిన కావ్యరసము నంతయు ననుభవించిన నచ్చుటకాదు. అసలు గ్రంథము నంతయు వీరు చదువరేమోనని నా విశ్వాసము. ఏ మహాను భావుడు ఏ శుభముహూర్తమున నిర్ణయించెనోగాని భారత మున కీచకవధ, కృష్ణరాయబారము ; భాగవతమున గజేంద్ర మోక్షము, రుక్మిణీకల్యాణము ; శృంగారనైషధమున నలుని రాయబారము ; మనుచరిత్రమున వరూధినీ ప్రవరాఖ్యము ; పారిజాతాపహరణమున ప్రథమాశ్వాసము ; వసుచరిత్రమున తృతీయాశ్వాసము ; పాండురంగమాహాత్మ్యమున నిగమ శర్మ కథ—ఇత్యాదిగా- ఇవి తప్ప ఆయా గ్రంథములలో ప్రాణభూతములైన మరేవిషయములు లేవన్న గాఢమైన నమ్మకము దేశమున విచిత్రముగా వ్యాపించినది. సహృ దయులైన పాఠకులకు తమ కిష్టమైన పుటలను తీసి గ్రంథము చదువుకొను స్వాతంత్ర్యమున్నదిగాని విమర్శకు నకు లేదు. గ్రంథమునంతయు చదువవలసిన బాధ్యత వీని కున్నది. ఆ బాధ్యతను విస్మరించి, లేక అసలెరుగక, ఒక గ్రంథమున నొక ఘట్టము చదివి అనుభవానందమున తల మునకలౌచు ముందుకు పోలేక, ఆ ఘట్టమునే తిరిగి తిరిగి చదువుకొని ఆవేశము నాపుకొనలేక తమ అనుభవమును వ్యక్తీకరించుటకు పూనుకొన్నప్పుడు ఆ గ్రంథము మహా కావ్యమనియు, ఆ కవి మహాకవి యనియు వచ్చును— అనుభవానందమునుపొందుట విమర్శకుడగుటకుకావలసినదే. కాని దానికది స్వయం సంపూర్ణముకాదు. అనుభవానంద మున తలమునకలౌవానికి తదాంతర్య మెరుగవలయునన్న ఆలోచన రానీయని మనోవికార మధికము. మనోవికారము యొక్క ఆవేగము అనుభవమును స్పష్టముగా దర్శింప నీయదు. అనగా వారి అనుభవము ఆలోచనాగర్భముగాక ఆవేశగర్భమన్నమాట. ఆవేశ మసలువిషయమును స్పష్ట పడనీయని గుణముకలది. అందువలన వారి కనుభవమే అసలు విస్పష్టముగా లేదు. కానివిషయమును ఐనట్లుగా చెప్పుట పొసగనేరనిది. కనుక కవి మాటలనే ఉదాహ రించుచు కథ చెప్పుకొనిపోవుచు మధ్య మధ్య తమ అను భవమును వ్యాఖ్యానించుచు 'ఆహా, ఓహో'ల వంటి వానిని జోడించుటతోపాటు, కవి దానిని వ్రాయునపు డెట్లుం డెనో తమ ఊహ కందినవరకు కవనమల్లి ఇవి కవి కిష్టములు-- ఇవి అనిష్టము లనుటవంటి గచ్ఛద్వ్యాఖ్యాన ముతో వెళ్ళదీయుటకంటె వారు మించి చేయగలిగిన దేమియు లేదు. వీరు గ్రంథమునంతయు చదువరన్న అను మానము నా కున్నదన్నాను, కాదు- గ్రంథము నంతయు చదువుదు రన్నను నా కభ్యంతరములేదు. దీనిని నేనంగీక రించినందువల్ల వారి విమర్శనము విషయమున నా చెప్పిన దానిలో మార్పురాదు. నా ఉద్దేశము ఫలానా స్థితిలో మున్నం దున వారి విమర్శన మట్టి రూపమును పొందుచున్న దని చెప్పుటగాని ఒక ఘట్టమును మాత్రమే చదువుట మూలముగా వారి విమర్శన మట్లున్నదని చెప్పుట కాదు.—కంకంటి పాపరాజు వ్రాసిన ఉత్తర రామాయణము నందలి సీతా పరిత్యాగ ఘట్టము శ్రీ ఇంద్రగంటి హనుమ

చ్ఛాస్త్రికి వచ్చినది. అందును సీతమ్మ శోకము. "నే నీఘట్టము చదువునపుడు హృదయము దుఃఖాభుగ్నమైనది. కన్నులు చెమ్మగిల్లినవి. ఏదియో మధురిమ స్ఫురించి ముగ్ధుని చేయును (చేసినది)" అని తన విషయమును మనవిచేసికొనుటతో పాటు దానిని వ్రాసినప్పటి పాపరాజునుగూర్చి "పాపరాజు హృదయము రసభరితమైనది. ఈ శోక ఘట్టము నటించుటకు తానె యీ భూమికను ధరించి రంగమున కురికి యుండును. ఎంత నిష్ఠతో, ఎంత అనుభూతితో, ఎంత వస్తు తత్వజ్ఞతతో నీపాత్ర నాయత్తపరచినాడో కదా కవిచంద్రుడు" అని విమర్శనమును ప్రారంభించి వాల్మీకి - తిక్కనల కంటె పాపరాజు దైన పై చేయిని సూచించుచు చివరకు తనను సీతతో పాటు ఆమె కెదురుగా అడవిలో నున్నట్లు భావించుకొని "ఆ కరుణ యా ప్రసన్నత... కాకుత్స్థుడు మఱచెగదా" అని సీత లక్ష్మణునితో అనుచున్నట్లున్న ఆ పద్యమును ఆమె తనతో చెప్పుచున్నట్లుగా నెంచి అందుకు తాను సమాధానముగా అమ్మా! మఱవలేదు, మఱవలేదు. ఆ పురుషోత్తము నొక సారి కన్గొనుము. అయ్యో! చూచితివా "ఆ కర్ణాయతనేత్రమై ....శ్రీరాము మోము" నీ కొరకెల్లు పరిపాండుదుర్బలమై పోయినదో. అమ్మా! దగ్గుత్తికతో నేమనుచున్నావు? "వనమున కేల వచ్చితివి వల్లభునిన్ బెడబాసి యొంటిగా ననని మునిపత్ను లెల్ల గుమిగూడి యడుగన్ ధృతిమాలి వారి కేమని వివరింతు....లక్ష్మణా" అనియా? ఎంత వెఱ్ఱిపడుచున్నావు? "జననీ! నీవు మహాపతివ్రతవు నీ సౌశీల్య మిల్లాంద్రకెల్లను మేల్బంతి" యని వారెరుగుదురు. నీ యంఘ్రికమల రజో లేశముల కన్నుల కద్దుకొందురు" అని విమర్శనమును ముగించి "ఈ మహాకవిని గూర్చి యొక గ్రంథము వ్రాయ వచ్చును" అన్నారు శ్రీ హనుమచ్ఛాస్త్రి. దక్షారామ కర్తయైన హనుమచ్ఛాస్త్రిగారిని మన మేమియు అనుటలేదు. వ్యాసావళి కర్తయైన హనుమచ్ఛాస్త్రిగారే మనకిట ప్రసక్తము. రెండింటికిని కర్తృత్వము వహించు హనుమచ్ఛాస్త్రి ఒకడుగా కనిపించుట దైవికము—ఉత్తర రామాయణమున ఏది అంగి? ఏవి అంగములు? అంగిని నిర్వహించుటలో వాల్మీకి-తిక్కన - పాపరాజుల దృష్టు భిన్నములౌనా? కాదా? నిర్వచనోత్తర రామాయణము-ఉత్తర రామాయణము రెండు ఒకే సాహిత్య ప్రక్రియలో చేరినవేనా? కావా? శోకమూర్తియైన సీతనే పాపరాజు అద్వితీయముగా చిత్రించినాడా? లేక రామునితో వనవిహారము చేసిన సీతను కూడా అట్లే చిత్రించినాడా? అసలు రామునిమీదకంటె సీతమీద పాపరాజు దృష్టి అధికముగా నున్నదా? ఉండి సాధించిన దేమి? ఉత్తర రామాయణ రచన కుపక్రమించిన పాపరాజు హృదయ మేమి? సర్వరచనయు తదుత్కర్షాపాదకముగా నున్నదా? ఇత్యాది ప్రశ్నము లేవియు విమర్శకులైన హనుమచ్ఛాస్త్రిగారికి రాలేదు. వారి యనుభవమున ఆవేశమున్నంత ఆలోచన లేదు. మానసికదార్ఢ్యత ఆలోచనాపటుత్వము. ఆవేశగర్భ మను భవమును పొందినవాని స్థితి కాలికి నేలందని కాసారమధ్యమున ఈతరాక ఉక్కిరి బిక్కిరియైనవాని స్థితి. వారి వ్యాసావళిలో నున్న ఐదు వ్యాసములును పైన వివరించిన స్థితిలో నున్నవే. ఐదింటిలో మూడు నచ్చి వ్రాసినవి. రెండు నచ్చక వ్రాసినవి. నచ్చి వ్రాసినను నచ్చక వ్రాసినను వేగ మొకటే. ధోరణులు మాత్రము భిన్నములు. 'వకుళమాలా పరిశీలనము'న "ఈ గ్రంథంలో ఉపజ్ఞ, ప్రతిభ లేనే లేవు. ఉన్నవారి ఉదాహరణములు చూడండి" అని కాళిదాసు, భవభూతి, నాయని, కృష్ణశాస్త్రిగార్ల పద్యములు నాలుగు వ్రాసి "ఉదాహృత పద్యములన్నింటిలో విప్రలంభ తత్వం గమనించండి. పదవిన్యాసమునందు, భావావిష్కరణమందు ఒకొక్క కవిలో ఒకొక్క మెఱపున్నది" అని వ్రాయుట విమర్శన మెట్లగును? తత్వము గమనింపవలసినదిగా మనకు సిఫారసుచేయుట కాదు విమర్శకుడు చేయవలసినది. మనము గమనించు తత్వము మనము గమనించుచునే యున్నాము. విమర్శకుడుగా తాను గమనించిన దేమిటన్నదే ముఖ్యము గాని సిఫారసుకాదు. ఒకొక్క కవిలో ఒకొక్క మెఱపేమి? పదివేల మెఱపులున్నవి. అసలు మెఱపులే లేవు - విమర్శకుడు తాను దర్శించిన మెఱపేదో? దాని నిడివి ఎంతో? దాని వెలుగులో ప్రకాశమునకు వచ్చిన వస్తు సమూహమేదో స్పష్టము చేయవలయును గాని మెఱపున్నదన్న చాలదు - అసలు కవితాత్మయొక్క చరమ సీమకు చేరుట యనగా ఆలోచనాగర్భము ధ్యానమున బుద్ధి రమించుట. అచట వ్యక్తిగతములైన ఆవేశములకు-కావేషములకు తావులేదు. ఓపికతో బుద్ధి పాటుపడనిచో కవిత్వము యొక్క ఆత్మ దృశ్యము కాదు. కవిత్వము ననుభవించి ఆనందించుట వేరు - విమర్శించుట వేరు - ఈ రెండును పరస్పరము సంబంధించినవి కావను నమ్మిక నాకు అస్పష్టమనిపించుచున్నది. అసలైన అనుభవానందము తరువాతి కార్యక్రమము విమర్శనము. మొదటిది లేక తరువాతిది లేదు. మొదటిదానిలో హేత్వంతరముల అన్వేషణములేదు. రెండవది మొదటిదానిలో ఏది లేదో దానితో ప్రారంభమై మొదటిదాని స్పష్టరూపమును నిరూపించును. అనుభవానందమును పొందిన ప్రతివాడును విమర్శకుడు కాకపోవచ్చును గాని, ప్రతి విమర్శకుడు తప్పక అనుభవానందమును పొంది తీరవలయును. లేనిచో విమర్శనమే పుట్టదు. అనుభవానంద

స్థితిని దాటని విమర్శకుడు ఉత్తమ విమర్శకుడు. వాని విమర్శన స్వభావములోని ఒక అంశము స్పష్టముచేసినాను.

హేతువిచారణ దూరములైన కొన్నింటిని కావ్యలక్షణము లనుకొనుట రెండవ అంశము. దీనికిని శ్రీ హనుమచ్ఛాస్త్రి గారి 'వ్యాసావళి' నుండి ఉదాహరణమును మనము గ్రహింపవచ్చును. "ఒక మహాకవిని నీవు మెచ్చుకున్నావంటే అతని వర్తమానమో భవిష్యమాణమో అయిన ఆదర్శం నిన్ను పట్టుకొని నిలబెట్టినదన్నమాట. కొన్ని శతాబ్దుల క్రిందటి కావ్యంలో నీ ప్రతిబింబం ఉందంటే దానిని నీవు మహాకావ్యం అనకుండా ఉండలేవు."— ఆదర్శము పట్టుకొని నిలబెట్టుట యన్నది కేవల మస్పష్టమధురము. "కావ్యంలో నీ ప్రతిబింబం ఉందంటే" అనేదికూడా అంతే. రెండింటిని కలిపి కొంచెము వ్యాఖ్యానించుకొన్నచో మన మన గుణ గణ ప్రవర్తనాదికము లేగ్రంథమున మనకు గోచరించునో దానిని మహాకావ్యమనియు- తత్కర్తను మహాకవి యనియు అనుకొనుచున్నామన్నమాట. అనగా కావ్యముల లోని పాత్రములు నిత్యజీవితములో ప్రత్యక్షము కావలయు ననిగదా అర్థము. అసిగా ఇప్పుడు మనలో కొందఱనుకొను సజీవపాత్రము లేగ్రంథమున నుండునో అది మహాకావ్యము. గ్రంథములోని పాత్రములు నిత్యజీవితమున ప్రత్యక్షము కావలయును. అట్లగుట మహాకావ్య లక్షణము, తల్లక్షణమును నిర్వహించినవాడు మహాకవి- ఇది సిద్ధాంతము. నిత్యజీవితమున ప్రత్యక్షమగుట కేవల విమర్శకునకేనా? లేక పాఠకులందరకునా? అందరకును ఆయా పాత్రములు ప్రత్యక్షమగుచున్నవనుటకు ప్రమాణ మెవరు? విమర్శకుడు తనకు తాను ప్రమాణము కాగలడుగాని లోకములోని పాఠకులకు కాజాలడుగదా? "గిరీశం, రామప్ప, అగ్నిహోత్రుడు, బుచ్చమ్మ ఇప్పుడు రోజూ కనిపిస్తారు" ఎవరి కన్నప్పుడు "నాకు" అని సమాధానము. నీకు కనిపించిన వారు నాకు కనిపింపవలయునని ఎక్కడున్నది? వారు నా కసలు కనిపించరు. నాకు మధురవాణి, పోలీసు కానిస్టేబులు - గవరయ్య వీరు కన్పింతురు. కన్యాశుల్కము నాటకములోని వారెవరును నాకు కన్పింపరు. "మాధవీ-మాధవులు"- "చిదంబరం"లాంటి వారు కన్పింతురు. అసలీపాత్ర లేగ్రంథములోనివో మీకు ముందు తెలియదు. ఎందుకు తెలియదనగా మీరు చెప్పిన కన్యాశుల్కమంత బహుళ ప్రచారములో అవి లేవు గనుక. బహుళ ప్రచారములో నున్న గ్రంథములలోని పాత్రములు సజీవములని చెప్పి అందువలన అవి మహాకావ్యములనుచున్నారు. బహుళమైన ప్రచారము ఒక గ్రంథముయొక్క మహాకావ్యత్వమును స్థాపింపదు. నన్నిచోడ దేవుని కుమారసంభవమునకు మిగిలిన తెలుగు గ్రంథములకంటె ప్రచారము తక్కువే అయ్యు అది మహాకావ్యమే. ఒక గ్రంథమునకైన మహాకావ్యత్వమన్నది ఆ గ్రంథగతమై ఉండు ధర్మముగాని ప్రచారము కాదు. మహాకావ్యములును బహుళ ప్రచారమున నుండును. బహుళప్రచారమున నున్నవన్నియు మహాకావ్యములు కావు. రాము డెంత ప్రసిద్ధుడో రావణుడంతే ప్రసిద్ధుడు. ఇరువురలో మహాపురుషు డెవడన్న ప్రశ్నమునకు సమాధానము రాముడని. రావణుడని చెప్పువారు లేరా? ఉన్నారు. ఇంతకును చెప్పవచ్చిన దేమనగా ఒక గ్రంథములోని పాత్రములు నిత్యజీవితమున ప్రత్యక్షమగుచున్నవని చెప్పి అది హేతువుగా ఆ గ్రంథము మహాకావ్యమని చెప్పి - పాత్రములు నిత్యజీవితమున ప్రత్యక్షమగుటను సాధారణ సిద్ధాంతముగా స్థాపింపరాదని ఆ సిద్ధాంతము పునాది లేనిదని - అసలు సజీవ పాత్రమన్నది Living Character అన్న అంగ్లమున కనువాదము. సజీవ పాత్ర మనగా అర్థము నిత్యజీవితమున ప్రత్యక్షమగుట కాదు. లోకములోని మానవున కాత్మధర్మమున్నట్లే కవియు తన గ్రంథమున విశిష్టమైన ఆత్మధర్మములతో పాత్రలను సృష్టించును. ఆ ఆత్మధర్మము, ఆ పాత్రము వాచికములోను, చేతలోను కొట్టవచ్చినట్లు కనిపించినపుడది సజీవ పాత్రమగును. ఆ ధర్మము నట్లు పోషించి తన్మూలమున ఒక మహాప్రయోజనము కవి సాధింపవలయును. గిరీశము సజీవ పాత్రమని నే నంగీకరించినను, అతడు నిత్యజీవితమున నాకు ప్రత్యక్షమగుటనుబట్టి కాదు. ప్రతి చిన్న విషయములోను ఎదుటివారిని మోసముచేసి తా నధికుడుగా నిలువద్రొక్కికొనుచు స్వార్థమును సాధించుకొను యత్నమాపాత్రము వాచికములోను చేతలోను నున్నది. అందువలన గిరీశము సజీవపాత్ర. అతని ఆత్మధర్మ మట్లుగా పోషించి నాటకములోని అంగి విషయమున నాటక కర్త ఏమి పరమ ప్రయోజనమును సాధించినాడని ప్రశ్న. ఈ ప్రశ్నకు సరియైన సమాధానము నీయకుండ 'నాకు గిరీశం రోజూ కన్పిస్తున్నాడూ, ఆరోగ్యంగానే ఉన్నాడూ' ఇత్యాది బులిబూచికపు మాటలతో సాగునది విమర్శనముకాదు. శ్రీ హనుమచ్ఛాస్త్రిగారు ప్రతిపాదించిన కావ్యలక్షణము వ్యవస్థలేనిదని తాత్పర్యము.

ఇట్టిదే ఇంకొకటి: "ఒక కావ్యముయొక్క మేలిమి నిర్ణయించునపుడు—దీనియందు నాటి సామాన్య ప్రజా జీవన మెంతవరకు చిత్రింపబడినది, యని వేయు తూకము గూడ నొకటి" ఈ వాక్యము శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులవారి

'తెనాలి రామకృష్ణుని తెనుగు కవిత' అన్న ఉపన్యాస వ్యాసములోనిది. వీరికంటె పూర్వమే శ్రీ రాళ్లపల్లి అనంత కృష్ణశర్మగారివంటి వారీ యభిప్రాయముతో కొన్ని వ్యాసములు వ్రాసిరి. అసలీ యభిప్రాయ మింగ్లీషులో నున్న Poetry is the criticism of life, reflection of life, copy of life ఇత్యాది సూత్రముల నాధారముగా చేసికొని పుట్టినది. అసలా సూత్రములే సుష్ఠుగా విచారితములు గావు. సామాన్య ప్రజా జీవన చిత్రణము కావ్యత్వ స్థాపన కుపస్కారకము కాదు. ఇట్లనుట వలన నాటి సామాన్య ప్రజా జీవనము కావ్యములలో నుండదన్న సిద్ధాంతమును నేను చేయుచున్నానని అనుకొనరాదు. సామాన్య ప్రజా జీవనమును నిరూపించినది సాంఘిక చరిత్ర గ్రంథ మగుటకు వీలున్నది గాని కావ్య మగుటకు వీలులేదు. సాంఘిక చరిత్రనే మేము కావ్యమనుకొనుచున్నా మన్నచో అనుకొనరాదని మనవి చేయుచున్నాను. రాయలవారి కాలపు టిండ్లలో ప్రతి ముంగిటిలో ఇరుప్రక్కల అరుగులు-కంబములపై బొమ్మలు - గోడలపై చిత్తరువులు - ఇంటి కొక పూలతోట - అందు చెంగలువల కొలను-దాని ప్రక్కన కృత్రిమముగా తయారుచేసిన కొండ- అందు గుహలు - ప్రతి ఇంటిలోను చిలుకలు - హంసలు - నెమిళ్ళు ; చిలుకలకు బంగారు పంజరములు - ప్రతి యింటిలోను నొక కోపగృహము - ఇత్యాదు లున్నవనియు నాటివారు సామాన్యముగా అభ్యంగమే నిత్య స్నానముగా నుంచుకొన్నట్లు కానవచ్చుచున్నదనియు - ఆ కాలపు జనులు పరమ రసికు లనియు వ్రాయుట కావ్యవిమర్శనము గాదు. కావ్యములోన వర్ణింపబడిన అంశములన్నియు నాటిసంఘమున నుండియుండునన్నది భ్రమగాని మరొకటి గాదు. పుండరీకుని తండ్రి విష్ణు సహస్రనామ పారాయణము చేసినట్లు రామకృష్ణుడు చెప్పినాడు గమక నాటి బ్రాహ్మణ గృహస్థు లందరును సంధ్యావందనమైనంతనే విష్ణు సహస్రనామ పారాయణము చేసెడివా రనుట పాండురంగ మాహాత్మ్యమును విమర్శించుట గాదు. ఆ మార్గమున బోయినచో నాటి వారందరును నిగమశర్మవలె కావి తిరుగుళ్ళు తిరిగి చివరకు పాండురంగ క్షేత్రమున కరిగి మరణించి ముక్తిని పొందెడి వారని సిద్ధాంతము చేయవచ్చును. కాని అది పద్ధతి గాదు. అయినచో జీవితమునకును కావ్యమునకును సంబంధము లేదా యని యందురు. ఉన్నది. జీవిత మార్గమును, కావ్యమార్గమును రెండును సమానాంతరరేఖలవంటివి. జీవిత మెన్ని మలుపులు తిరుగునో కావ్యమును అన్ని మలుపులు తిరుగును. భావనావధిగాని ప్రత్యక్ష సత్యము జీవితము. భావనావధియైన ప్రత్యక్ష సత్యము కావ్యము. భావనావధి యనుటవలన కావ్యము మన యీ జీవితమంత సత్యము గాదని చెప్పుట యైనది. ఆ రెండును రెండై అన్యోన్యాశ్రయములైనవి. అందువలన మనము ఒక దానినిబట్టి రెండవదానిని అర్థము చేసికొందుము. అదే జీవితమార్గమునకును కావ్యమార్గమునకును నున్న సంబంధము. దీని ప్రతిబింబ మదిగాని, దాని ప్రతిబింబ మిదిగాని కాదు. జీవితమునలేని క్రమపరిణతమైన సాపేక్షసము కావ్యమునయున్నది. ప్రతిబింబమైనచో నట్లుండుటకు వీలుండదు. దీని యను భావము వేరు. దాని యనుభావము వేరు. దానివలన నిది, దీనివలన నది ప్రకాశించును. అదే సంబంధము. అందువలన కావ్యముయొక్క మేలిమిని నిర్ణయించుటకు నాటి సామాన్యజన జీవిత చిత్రణ మెంతగా చిత్రింపబడినదన్న ప్రశ్న రాదు. కాదిదే సిద్ధాంతమన్నచో క్రీడాభిరామము- సింహాసనద్వాత్రింశిక - శుకసప్తతి - హంసవింశతి ఇత్యాది గ్రంథములే ఆంధ్రమున మహాకావ్యములని చెప్పవలసి వచ్చును. ఆ గ్రంథములు మహాకావ్యములు కావు. ఆ సిద్ధాంతము కావ్యలక్షణ సిద్ధాంతముగాదు.

ఇట్టిదే మరొకటి : నాటకీయ శిల్పము మహాకావ్యలక్షణమని నాటకీయ శిల్పమనగా పాత్రలు పరస్పరము మాటాడుకొనుచున్నట్లుగా వ్రాయుటేనని. అట్లు వ్రాసినవారు మాత్రమే మహాకవులని. తిక్కనాదు లట్టివారని— నాటక శిల్పమంతయు సంభాషణమేకాదు. నాటకమున ప్రధానముగా కనుపించునవి పాత్రముల వాచికము-అభినయము. అభినయము వాచికానుగుణము. వాచికము మనోవృత్త్యనుగుణము. వాచిక మనుటవలన సంభాషణము గ్రాహ్యము. స్వగతములుగూడ నుండుట వాచికమంటిని. సంభాషణాభినయములు మాత్రమే నాటకము కాదు. నాటకవస్తువున్నది. అది వానిద్వారా అభివ్యక్తము కావలయును. నాటకవస్తువు కావ్యవస్తువువంటిది గాదు. వస్తువనగా కథ. ఒక పరమార్థము నిముడ్చుకొన్న కథ. కావ్యమునకైన కథలోను పాత్రముల మాటలు చేష్టలు ఉండనే ఉండును. అట్టిచో కావ్యమునకును నాటకమునకు భేదమేమన్నచో వస్తుగ్రహణమున భేదమున్నది. కావ్యకర్త కథను మొదటినుండి చివరిదాక అల్లుకొని క్రమముగా రచన సాగించుకొనును. నాటక కర్త అట్లుగాక కథలోని ఒక ఘట్టము నందుకొని ప్రారంభించి అంచెలంచెలుగా ఘట్టముల నందుకొనుచు మధ్యమధ్య జారిపోయిన కథను గ్రహించిన ఘట్టములను నిర్వహించుటద్వారా అభివ్యక్తము చేయును. ఈ లక్షణము నాటకమును కావ్యమునుండి పృథక్కరించి చూపునది. కవి తానుగా ఏ విషయమును విశదీకరించుచున్నట్లు

కన్పడమి ఏతల్లక్షణ గర్భమందున్న విషయము. ఈ విషయమే పర్వమును పాత్రల వాచికాభినయాధీనము గావించినది. అందువలన అవి ప్రధానముగా కనిపించును. అవే నాటకస్వరూపము కావు. తిక్కనగారు విరాటపర్వ కథను మొదటినుండి చివరిదాకా వ్రాసినారా ? లేక ఒక ఘటముతో ప్రారంభించి అంచెలమీద ఘట్టముల నందిపుచ్చుకొని వ్రాసినారా ?—కావ్యకర్తవలె మొదటినుండి చివరిదాకా వ్రాసినారు. నాటక కర్తవలె వ్రాయలేదు. వ్రాసినచో భారతము - కాదు విరాటపర్వము - నాటకమై యుండెడిది. ఇతిహాసమో కావ్యమో అగుట కాస్కారముండెడిది కాదు. నాటకములో ప్రధానముగా కనిపించెడి సంభాషణాదికము తిక్కనగారి భారతమున కనిపించుచున్నందున తన రచనమున కాయన నాటకలక్షణ మబ్బచేసికొన్నాడని అనుచున్నామన్నచో నన్నయగారిలో గాని మరి ఏ యితర తెనుగు కావ్యకర్తలో గాని లేని గుణముకాదది. ఆలెక్కను చూచినచో కీచకవధ రచనమునకైన మూడు వందల నలభై గద్య పద్యములలో పాత్రముల పరస్పర సంభాషణములుగా వ్రాయబడినవి నూట యాభైకి మించిలేవు. ఎఱ్ఱన వ్రాసిన సైంధవ పరాభవము నూట పది గద్య పద్యములలో అరవై యైదింటికి పైగా సంభాషణములకైనవి. నన్నయ శిశుపాలవధ ఘట్టమును వ్రాసిన అరవై రెండు గద్య పద్యములలో దాదాపు యాభై సంభాషణముల రూపముననున్నవి. సంభాషణముల ద్వారా కథను నడిపించుట నాటకలక్షణమును కూర్చుకొనుట యని ఇంకను సాగదీసినచో నూటికి నలభై యైదు పాళ్ళు నాటకలక్షణమును గూర్చుకొన్న తిక్కనగారికంటె, అరవై పాళ్ళు కూర్చుకొనిన ఎఱ్ఱన, డెబ్బది వంతులకు మించిన నాటకతా లక్షణమును చూపించిన నన్నయ క్రమముగా ఏతచ్ఛిల్పమున ప్రజ్ఞ గలవారని అంగీకరింపవలసి వచ్చును—అసలు నాటక జీవలక్షణము సంభాషణాదులలో కాక వస్తు గ్రహణములో నున్నదని మనవి చేసినాను. వస్తు గ్రహణములో కావ్యమునుండి నాటకము ఎందు భిన్నము కావలయునో తరువాత చెప్పెదను—మన కిది నాటకమని ఎప్పుడు తెలియుచున్నది? అసలు వానికి బదులుగా మరొకడు తదుచితమైన వేషమును ధరించి, తదాంతర్యానుగుణమైన వాచకముతోడి తదవస్థను తద్రైక్యభావము కలిమి వ్యక్తీకరించి ఆ అసలు వానిని ప్రత్యక్షపరచినపుడు. ఇట్లు ప్రత్యక్షపరపుట నాశించిన కవి వ్రాసినది నాటకము. ఏతదాశయము లేనివాడు కావ్యకర్త. అనగా చర్మ చక్షువుద్వారా లోకము మనస్సునకు తాను చెప్పదలచుకొన్న దానిని తెలియజేయు ఆశయము గలవాడు నాటక కర్త. మనస్సు నేత్రమై సర్వమును దర్శించి ఆకళించుకొనుటకు కోరినవాడు కావ్యకర్త. చర్మ చక్షువుకంటె మనోనేత్రము శక్తిమంతమైన దనుట. శాకుంతలాది నాటకములను భారతాదులవలె ఎవరికి వారు చదువుకొని ఆనందింప గలుగుచున్నారు - చర్మచక్షువుశక్తి పరిమితమైన దగుటవలన, తద్వారా లోకము మనస్సున కెక్కునట్లు చెప్పుట నాశించిన కవి, తదాశయము లేని కావ్య కర్తవలె వస్తువును గ్రహించుట వీలుపడనిది. అది హేతువుగా కావ్యనాటక వస్తువులలో కించిత్తు భేదమేర్పడినది. ప్రేక్షకులకు విసుగులేని ఔత్సుక్యము కూర్చుటతో పాటు దేశకాలములచేత పరిమితముగాని వస్తువును నిర్దిష్టస్థలమున, పరిమితమైన కాలమున తానుగాని మరొకడు ప్రత్యక్ష పరచుటకు వీలుగా చేయుటలో, నాటకకర్త వస్తుసంబంధి ఘట్టముల నంచెలమీద అందిపుచ్చుకొనవలసి వచ్చినది. ఏతన్మధ్యగత గతాగామి కథాంశముల వివేకము, గ్రహించినవాటిని నిర్వహించుటలో కలిగింప బడుచున్నది. కావ్యకర్త తానే సర్వమును లోకము మనోనేత్రమునకు ప్రత్యక్షపరచువాడగుటవలన వస్తువు నానుపూర్విగా గ్రహించి నిర్వహించుచున్నాడు - తిక్కనగారు తన విరాటపర్వము నంతయు గాని, కేవలము కీచకవధగాని మరొకడు లోకమునకు ప్రత్యక్షపరుపవలయునన్న సంకల్పముతో వ్రాయలేదు. తానే సర్వమును ప్రత్యక్షపరచెను. శిశుపాలుని పాత్రను శిశుపాలుడు వలె, సైంధవుని పాత్రను సైంధవుడువలె, కీచకుని పాత్రనుకీచకుడే నిర్వహించినాడు. ఎవని పాత్రను వాడు నిర్వహించుట అభినయించుటకాదు. అయినచో నిత్యజీవితమున మనము మన పాత్రల నభినయించుచునే యున్నాము. కాన నాటకములు చూడబోనవసరములేదు— నాటకకర్త వ్రాయునది అసలువాని విషయమే. అనగా రామాదుల విషయమన్నమాట. అయితే దానిని మరొకడు ప్రత్యక్షపరచుటను కోరినాడు. ఈ కోరిక లేకుండ అసలు వాని విషయము వ్రాసనవాడు కావ్యకర్త. అందువలన పఠించుకొను నవసరమున కావ్యమెంతో నాటకమంతే. అనగా నాటకము కావ్య ధర్మమునే కలిగియున్నదన్నమాట. బీజ బింద్వాదులన్నవి వస్తువు నిబిడమై ఏకవాక్యతకు నోదిగి పరమ రమణీయమగుట కుద్దేశింపబడినవి. కావ్యనాటక వస్తువులు రెండింటికిని అవి ఉపాదేయములే. వస్త్వంతరానుసంధానములో దీనికి మూలమైన ప్రత్యక్ష పరచుటలోగల దృష్టి భేదమును పురస్కరించుకొని ఏర్పడిన భిన్నత్వము తప్ప మిగిలిన పర్వరచనా శిల్పమును మహానాటకమునకెట్లో మహాకావ్యమున కట్లే— చెప్పవచ్చిన దేమనగా పాత్రముల సంభాషణములు నాటకమున కంగభూతములుగాని ప్రాణభూత

ములు గావు. సంభాషణములే నాటకమనుకొనుట- అది తిక్కనాది కొందరు కవులలోనే ఉన్న దనుకొనుట. రెండును అవిచారకములు. కావ్యమునకంటె నాటకము గొప్పదన్న వృథా భ్రాంతివలన, తిక్కనాది కవులపట్ల నిర్హేతుకముగా కలిగిన అభిమానము కలిమిని, కావ్య నాటకాంతర్భేద వివేకము లేమిని పురస్కరించుకొని ఏత దభిప్రాయము ప్రచారమున కెక్కినది. కావ్యనాటకములు రెండును రెండు సాహిత్య ప్రక్రియలు. అందు హెచ్చు తగ్గులు లేవు. ఉన్నవనుకొనుట కుడికన్ను కంటె ఎడమ కన్ను గొప్పదనుకొనుటవంటిది. అయినచో నన్నయ తిక్కనల రచనా మార్గము లభిన్నములని భావించుచున్నావా? అందురు. లేదు. అట్లు భావించుటలేదు. నన్నయ కథయొక్కయు తత్సంబంధి పాత్రలయొక్కయు ఆత్మ ధర్మ వ్యంజకముగా రచన చేసి మిగిలిన సర్వాంగములను పాఠకుల భావనకు వదలగా, తిక్కన అభిధనాశ్రయించి సర్వాంగ చిత్రణముచేసి తదాత్మ ధర్మమును భావనా వధిగా వదలును. రెండింటిని వేరువేరుగా గుర్తింప దలచినపుడు దానిని కథాకథన శిల్పమనియు, దీనిని వర్ణన శిల్పమనియు అనుకొనవలె. తెనుగు కవులలో సుప్రాతిక ముప్వీసమునకు పైగా తిక్కనగారి ఆ శిల్పము నాశ్రయించుకొని వ్రాసికొన్నవారే. అయితే వారందరును తిక్కనగారివలె ఏల మహాకవులు కాలేదనగా, చాలమంది స్థూలదృష్టికి కనిపించు ఆ శిల్పమును మాత్రమే అనుకరించి, ఆయనవలె వస్త్వంతరమైన ఆత్మధర్మమును దానిద్వారా భావనావధిగా చేయలేకపోవుటవలన. ఎంతగా చేయగలిగిన వాడు అంతగా మహాకవుల కోవలో ఉండనే యున్నాడు.

లాక్షణిక మార్గమని, తదాంతర్యమును తెలిసికొనకుండ, సాగు విమర్శనము ఉత విమర్శనాధ్వమున మరొక మైలురాయి—. ఇట్లనుటవలన లాక్షణిక మార్గము నుస్తైనది గాదని నేను భావించుచున్నట్లుగాదు. ఇవి ఇవి కావ్యలక్షణములని ఏ ఏ లాక్షణికులు చెప్పిరో వారి వారి ఆ ఆ వాక్యముల నెరుగుట లాక్షణిక మార్గము నెరుగుట. ఎరుగుటకు చదువుకొనుట గాని వినుటగాని చాలును. ఆంతర్యము తెలియుటకు బుద్ధి కలిమిని పఠించుట కావలయును. ఆలోచనా పటువైన బుద్ధితో చదువుట పఠించుట. కన్నులతో చదువుకొన్న వాడు, చెవులతో విన్నవాడు, ఏవిషయమునకైనను ఎరిగిన వాడుగా చలామణి కావచ్చును. కన్నులతో మాత్రమే గాక బుద్ధితో చదువుకొన్నవాడు తదాంతర్యము తెలిసికొన్న వాడు. దండి కావ్యాదర్శము ప్రథమ పరిచ్ఛేదమున నున్న ఆ (16, 17, 18) మూడు శ్లోకములు కన్నులతో చదువుకొన్న వానికి అష్టాదశ వర్ణనము లుండుట కావ్యలక్షణమని తెలియును. దండిదాకా పోనక్కరలేదు. కావ్యాలంకార చూడామణి తృతీయోల్లాసములోని తొంభై రెండో పద్యము చదువుకొన్నను కావ్యలక్షణ మదియని తెలియును. ఆవిధముగా కావ్యలక్షణముల నెరిగినవానికి, అష్టాదశ వర్ణనము లెందుకుండవలయును? ఎట్లుండవలయును? అన్న ప్రశ్నములకు సమాధానము తెలియదు. దండి వ్రాసిన ఆ శ్లోకములలో చివర రసభావ నిరంతరమని యున్నది. దానిని బుద్ధితో చదివినవానికా ప్రశ్నములకు సమాధానము తెలియును. ఆ తెలిసినవాడు కావ్యమును మెచ్చుకొన్నచో అది అచ్చమైన మెచ్చుకొనుట. విమర్శించినచో అది అచ్చమైన విమర్శించుట. నేనెరిగిన అష్టాదశ వర్ణనల జాబితాకు నుదాహరణము గీకావ్యమున నిండుగానున్నవి గనుక ఇది మహాకావ్యమనుట మెచ్చుకొనుటయు గాదు - విమర్శించుటయు గాదు. కాని దానినవుననుకొనుట భ్రాంతి. ఇంతకును బుద్ధితో చదువుకొనుట యనగా నేమో చెప్పలేదు. రసభావ నిరంతర మన్న దండి శ్లోక భాగమునకు వ్యాఖ్యానరూపమున నున్న ఈ విన్నకోట పెద్దన పద్యము చెప్పినచో అది చెప్పినట్లే. ఆ పద్య మిది.

ఇటు లష్టాదశవర్ణనా కలితమై యేపారు కావ్యంబు నం
తటఁ బాటించి తదర్థ సంఘటనముం దర్కించి, భావోదయ
స్ఫుట భేదంబు లెఱింగి, తద్రసగతుల్ శోధించి, అచ్చంపు మె
చ్చుటకుం దావలమై చతుక్యపతి సంశోభిల్లు నెల్లప్పుడున్.

అష్టాదశవర్ణనములతో కావ్య మున్నది. ఆ యా వర్ణనము లా కావ్యమున నే యే సందర్భముల నున్నవో ముందు విచారింపవలయును. ఆ కావ్య మే యర్థ సంఘటనార్థ మగుచున్నదో సహేతుకముగా నిరూపణము కావలయును. ఆ యా వర్ణనములవలన నే యే భావములు ప్రాదుర్భవించుచున్నవో స్పష్టముగా నెరిగి అవి కావ్యార్థ సంఘటనమున రసస్వరూపమున నెట్లు పర్యవసితము లగుచున్నవో పరిష్కరించుకొన్న తరువాత కావ్యము బాగున్నదనిగాని, లేదనిగాని చెప్పుట అచ్చంపు మెచ్చుకొనుమాట. ఊరక మెచ్చుకొనుటకే అంత చేసినగాని వీలుపడనపుడు ఇక విమర్శించి వ్రాయుట కెంత కావలయు? లాక్షణికమైన విమర్శన మనగా ఇదిగాని అష్టాదశ వర్ణనములున్న గ్రంథమును అవి యున్నవి గనుక మహాకావ్య మనుట గాదు. రాయలవారు ఋతువర్ణనము చేసిరి. ఆయన మహాకవి. వాల్మీకి చరిత్రమున రఘునాథ రాయలవారును ఋతువర్ణన చేసిరి. ఆయన మహాకవి - ఇట్లనుట మహాకవి శబ్దార్థము తెలిసికాదు. కావ్యపరమార్థము నెరిగికాదు. అసలష్టాదశ

వర్ణనము లెందుకు కావ్యమున నుండవలయును? అప్పకవి ఇంక నాలిగింటిని అధికముగా గూడ చెప్పినాడుగదా? ఒక మహోదాత్తుడైన నాయకుని జీవితమును, ఒక పరమార్థమును మనస్సున బెట్టుకొని, సంపూర్ణముగా కావ్యమున వ్రాయవలయునని పూర్వులైన లాక్షణికుల నిష్కర్ష. మహోదాత్తుడైన నాయకుడు పరమేశ్వరుడు తప్ప మరొకడు లేడు. ఆ పరమేశ్వరాంశ మానవలోక పాలకుడైన వానియం దున్నట్లుగా వారు భావించినారు. ఆ భావనతో నాయకుడుగా రాజును స్వీకరించినారు. రాజుగారి యుదంతము పురవర్ణనముతో ప్రారంభించి సుతోదయముతో నంతము చేయుటలో నొక చమత్కారమున్నది. సుతోదయమైన తరువాత రాజుగారికి కథయుండదా? కథ లేక పోయినను రాజుగారుందురు. రాజుగారున్నపుడు కథను కల్పింపవచ్చును. అంతకుముందు జరిగినదంతయు కల్పితమేగదా! కాని తరువాత కల్పనమును లాక్షణికుడు చెప్పలేదు. ఏల చెప్పలేదు? సుతోదయమైన తరువాత రాజుగారి పని యైపోయినది. తన తరువాత తనపని పూర్తి చేయుటకు కుమారుడు కలిగినాడు. తాను తన కర్తవ్యమును నెరవేర్చుచు ప్రజాతంతువు విచ్ఛిత్తిని పొందకుండ చూచినాడు. సంతానము కలిగిన తరువాత దృష్టి ఐహికము నుండి పారమార్థికము మీదికి పోయినది. పారమార్థిక జీవన విధానమును చెప్పు పని కావ్యమునకు లేదు. పురాణేతిహాసము లందుకున్నవి; కనుకనే కావ్యము సుతోదయమగుటతో నాగుచున్నది. సంపూర్ణ జీవితమును నిరూపించుటకు కథ యేయే మార్గముల బోవలయునో సూచించునవి అష్టాదశ వర్ణనములు. కవి తా నుద్దేశించిన పరమార్థమును తన తన నాయకుని జీవలక్షణముగాచేసి ఏతల్లక్షణము స్వయంపుష్టమై కావ్యరసముగా పరిణమించుటకే యా సూచనల ననుసరించిపోవును. తన ఉద్దేశించిన పరమార్థ నిరూపణమున కాయా సూచన లెంతవర కనుకూలించునో అంతవరకే గ్రహింపవలయును గాని అధికముగా గ్రహింపరాదు. లాక్షణికులదృష్టి అష్టాదశ వర్ణనముల వంటివి కథాగతి కుపస్కారము లనియే గాని, వాని నన్నింటిని యేకరువు పెట్టి గుదిగుచ్చినచో మహాకావ్య మగునని గాదు. కావ్యము యొక్క జీవము రసము గాని అష్టాదశ వర్ణనములు గావు. లాక్షణిక మార్గముయొక్క ఆంతర్యము తెలియనివారు కావ్య విమర్శనలు చేయుచుండుట మూలముగా, నీ మధ్యకాలమున వచ్చిన అభ్యుదయ భావకులు లాక్షణికులనుగురించి వివేకము లేనివారుగా మాటాడుచున్నారు. లక్షణ గ్రంథములను చదివిన వెనుకటివా రాంతర్య మెఱుగలేదు. చదువని వేటివారలు చదువలేదు. చదివినను అక్కడక్కడ మాత్రమే. గ్రంథము నక్కడక్కడ చదివిసదానికంటె అసలు చదువకపోవుట మంచిది. చాలమంది అప్పకవీయమున తృతీయాశ్వాసమును చదువుదురు. అది పాఠ్యముగా నున్నది గనుక. అందరికంటె నింక నాలు గధికముగా కలిపి ఇరువది రెండు వర్ణనములు వ్రాయవలయు నన్నాడని అప్ప కవిని నిందించుచున్న వారిని నే నెరుగుదును. ఈ ఇరువది రెండు వర్ణనము లుండవలయునని అప్పకవి వ్రాసిన పద్యముపైన నొక పద్యమున్నది. ఆ పద్యమును చదివినచో అప్పకవి కావ్యమనగా నిరువది రెండు వర్ణనములతో నున్నదేనన్న విశ్వాసము గలవాడా? లేక మరొక విధముగా కావ్యస్వరూపము నెరిగినవాడా? అన్న విషయము బోధపడును. ఆ పద్యమిది

ఉచ్చారణక్రియ నొప్పారు వర్ణంబు
వర్ణసంచయమున వఱలుఁ బదము
పదవితానముచేత భాసిల్లు వాక్యంబు
వాక్యభేదమున నివ్వటిలు వర్థ
మర్థ వశంబున నమరును భావంబు
భావసంగతిఁ గనుపట్టు రసము
రస సుప్రశస్తిచేఁ బొసగును పద్యంబు
పద్యరాశిని కూర్పబడును కావ్యము.

ఇంకను ఆయావర్ణనములుండి పద్యములలో వ్రాయబడినదే కావ్యమని పూర్వులనుకొనినారను వారికి నమస్కారము చేయుట తప్ప మనము చెప్పతగినది లేదు. వర్ణమునుండి రసమువరకు క్రమపరిణతిని నిరూపించిన అప్పకవి వివేకము లేనివాడైనచో వివేకమునకు మనము క్రొత్తగా వర్థమును నిర్ణయించుకొనవలయును. లాక్షణిక మార్గముయొక్క ఆంతర్యము నెరుగకుండ ఏవేవో ఉదాహరణము లుటంకించి అది మహాకావ్యమనుట విమర్శనము కాదు. అనుభవానందమునుండి అనగా అనుభవముయొక్క వేగిరపాటునుండి తేరుకొని తట్టుకొనలేనివారును స్వతంత్రబుద్ధిమై ఆలోచించి కావ్యలక్షణములని చెప్పబడు వాని ఆంతర్యము నెరుగని వారును వ్రాసెడు వ్రాతలు విమర్శనములు కావు.

అసలు విమర్శకునకు ముందు ముఖ్యముగా నుండవలసినది ఆలోచనపటువైన స్వతంత్ర బుద్ధి. ఆ బుద్ధిగల విమర్శకులు తెనుగుదేశమున నలుగు రున్నారు. శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి, శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ, శ్రీ నండూరి బంగారయ్య, శ్రీ విశ్వనాథ సత్యనారాయణ. స్వతంత్ర బుద్ధి యన నేమో ఈ నలుగురిలో ఆ బుద్ధి ఏ ఏ పరిధులలో నున్నదో మరల నెప్పుడో వ్రాసెదను.

★ ★ ★

# సంపాదకునికి లేఖలు | మాచిరాజు దేవీప్రసాద్

సంపాదకునికి లేఖలు అంటే వేరే నిర్వచనం అనవసరము. కాని నిర్వచనముచేసి మరీ చెప్పడం సాంప్రదాయము. ఈ నిర్వచనం చేయడానికి అనేక సులభోపాయాలు ఉన్నయి. ఒక మతంప్రకారం: ఈ సంపాదకునిలేఖ అనేమాట రెండు ముఖ్యపదాల సమ్మేళనం. అందు ఒకటి సంపాదకుడు రెండు లేఖ. యీ రెండింటిని వేరువేరుగా నిర్వచించి మధ్యలో "కి" పెట్టి పొదిగితే సంపాదకునికి లేఖలు అనే నిర్వచనం రావచ్చు అని వాదించేవారు లేక పోరు. ఇది అతి సూక్ష్మమార్గం. పెరుగుతోటకూర అంటే పెరుగు, తోట, కూర యొక్క కూడలి అన్నట్టు ఉంటుంది. ఇక స్థూలంగా విచారిస్తే, ఇది కూడ ఒకలాంటి ఉత్తరమే గనుక ముందు ఉత్తరం నిర్వచనం చేయాలి. ఉత్తరం అంటే కొన్ని ఆలోచనల సమూహాన్ని ఇంకో చిరునామాదారుడికి బట్వాడా చేయడం. ఇది మామూలు ఉత్తరం. ఈ రెండూ, అంటే వ్రాయడానికి సరుకూ వ్రాసేందుకు మసిపీ ఉన్నప్పుడు మామూలు ఉత్తరమే రాయొచ్చు. అందుకని వ్రాసేందుకు సిసలైన చిరునామాదారుడు, తెలిపేందుకు విషయం ఏమీ లేనప్పుడు ఉత్తరం రాయాలనే కుతూహలాన్ని తీర్చుకొనే ప్రయత్నం సంపాదకునికి లేఖ అని నిర్వచించారు.

ఈ ఉత్తరాలు అనేక రకాలు. కొన్ని చిన్నవి, కొన్ని పెద్దవి. కొన్ని చిన్న విషయంమీద భారతమంతవి - కొన్ని భారతమంత విషయంమీద బస్సు టిక్కెటు సైజువి. కొన్ని పొడుగు ఉత్తరాలు పొట్టి సంతకాలు గలవి - కొన్ని పొట్టి ఉత్తరాలు పొడుగాటి సంతకాలుగలవి. కొన్ని విషయం ఉండి సంతకాలు లేనివి, కొన్ని విషయాలు సంతకాలు రెండూ లేనివి.

ఇన్నిరకాలు కాబట్టే అనేకతత్వాలు యిందులో ఇమిడి ఉంటయి; మానవుడు చేసే సత్యాన్వేషణ దానికై పడే తిప్పలు, మానవుడిలోఉండే చిన్నతనపు చిలిపిచేష్టా, దాన్ని దాచటానికై మెలిపెట్టే మీసాలూ, అతనిలో ఉండే అమాయకత్వం, అది కనబడకుండా వేసే బురఖా అతనిలో ఆరంభశూరత్వం, కొంచెం పాతబడగానే దానిమీద కలిగే ఉపేక్షలాంటి తత్వాల్ని ఈ ఉత్తరాలు రుజువు చేస్తయి.

ఇవి వేరువేరు విధాలుగా, తత్వాల్ని ఎలా నిరూపిస్తయో, తెల్పి చెప్పడంకన్నా కొన్ని ఉత్తరాల ధోరణిని పర్యాలోకిస్తే గమ్యం సులభం.

ఒక దినపత్రికలో ఒక సుమూహార్తంలో ఒక "శ్రేయోభిలాషి" యిలా మొదలు పెడతాడు:

'సంపాదకా, చూడండి ఆ "అనంతపురం"నుంచి "అనంగవరం" పోయేరోడ్డు! ఎక్కడ చూచినా గుంటలూ మెట్టలు. ఆ నిమ్నోన్నతాల కీవి వర్ణనాతీతం. ఆ మిట్టపల్లాలు చూస్తే రోడ్డుమీద నల్లమలా కనుమల పరంపర పేర్చారా అనిపిస్తుంది. మన డిస్ట్రిక్టుబోర్డు కర్రబోర్డల్లె కూర్చొకపోతే బాగు చేయించగూడదుటండీ.

ఇట్లు
శ్రేయోభిలాషి

వెంటనే మరుసటి రోజున ఒహా పెద్దమనిషి దీన్ని చదివి యిలా అందుకుంటారు:

సంపాదకులకు

నిన్న మీ పత్రికలో శ్రీ శ్రేయోభిలాషిగారు వ్రాసింది అక్షరాలా నిజం. మొన్ననే మా పెద్ద అబ్బాయి ఆ రోడ్డుమీద ప్రయాణం చేసాడుట. ఆ రోడ్డునిమ్నోన్నతాలు ఎంతదట్టంగా ఉన్నయంటే, ఒక కాలు గుంటలో వేస్తే రెండోది గుంటమీదతప్ప ఆనదుట. అందుచేత ఏ నిమిషంలో చూచినా నడుస్తున్న మనిషి కాళ్ళు, ఒక కాలుకంటె రెండోది అరగజం పైకిగాని, క్రిందకుగాని ఉంటుందట. మావాడు ఆరోడ్డుమీద చకచక నడవటం తూగుటుయ్యాలలో ఊగటంలాంటిది అని నిర్ధారణ చేశాడు. బాటసారుల బాధే ఇదైనప్పుడు, బండ్ల వాళ్ళమాట వేరే చెప్పాలా ?

డిస్ట్రిక్టుబోర్డు తగుచర్య తక్షణం తీసుకోవాలి.

ఇట్లు
*శ్రేయోభిలాషికి శ్రేయోభిలాషి*

మొదటి శ్రేయోభిలాషి ఇది సమంజసము, సర్వజన సమ్మతము, యీ చెడుగుని నివారణ చేయాలి అనే తీర్పు గలవాడు. ఇంతేగాక ఆయన తత్వంలో పారమార్థిక చింత 'సర్వేజనాః సుఖినో భవంతు' అనేవి గోచరమౌతయి. కాని రెండో పెద్దమనిషి "శ్రేయోభిలాషికి శ్రేయోభిలాషి" అదే రాస్తున్నా చర్విత చర్వణం, కలవాడు. అదిగో పులి అంటే ఇదిగో తోక అనే తత్వం అన్నమాట. ఈ ఇద్దరికికూడా రాబోవు యే ప్రమాదాలు తెలియవు.

వెంటనే మూడోరోజున యింకో లేఖ వస్తుంది.

సంపాదకా !

మీ పత్రికలో నిన్న మొన్నవచ్చిన అనంతపురము నుంచి అనంగవరం పోయే రోడ్డు గురించి వివరించే ఉత్తరాలు చూచితిని. శ్రీ శ్రేయోభిలాషిగారు దానిమీద గుంటలు మెట్టలు నల్లమలా కనుమలలా గున్నయ్యన్నారు. ఇది అచ్చం అతిశయోక్తి తప్ప మరోటికాదు. దానిమీద అంతేసి గుంటలు ఎక్కడున్నయండి. మరి అరగజంలోతా? ఎబ్బే! లేవు. అన్నిటి కంటే పెద్దగుంటలో కాలు వేస్తేనే చీలమండదాటి దిగబడదు. అలాంటప్పుడు అరగజం దిగబడుతుందని శ్రీ శ్రేయోభిలాషికి శ్రేయోభిలాషి అనడం శోచనీయం. ప్రస్తుతం అనేక క్లిష్టతర విషమ సమస్యలను ఎదుర్కొంటున్న మన డిస్ట్రిక్టుబోర్డును యిలాంటి తప్పుడుమార్గంలో పెట్టి దానికి ఓక్రొత్త ఆర్థికసమస్య తీసుకరావటం భావ్యం కాదు.

ఇట్లు
*మితవాది*

ఇది మూడో తత్వం. ఈయనతత్వం ఈయన పేరే చెబుతుంది. ఈయనకి, పై శ్రేయోభిలాషులు విరోధులు కారు, డిస్ట్రిక్టుబోర్డు సన్నిహితం కాదు. ఈయన రాయడానికి కారణం సంఘర్షణని అరికట్టి కార్యాన్ని సౌమ్యంగా సాధించాలనే అభిలాష. ఇదే కయ్యానికి సయ్యాటలాడుతున్న **aggressor** ని నిరోధించి **defence** లేని అమాయికత్వాన్ని వీపు చరచి **Balance of Power** నిలబెట్టే తత్వం.

ఇక మరుసటిరోజు నాలుగో ఉత్తరం వస్తుంది.

సంపాదకా !

మితవాదిగారు అనంతవరం రోడ్డుమీద గుంటలు చీలమండలదాకా మాత్రమే దిగబడేటంత చిన్నవనడం దేశద్రోహంలాంటి అబద్ధం. ఆ గుంటలు ఒక్కొక్కటి ఒక అఘాతం అంటే నమ్మండి. నిన్ననే మా ఆడవాళ్ళు బండిచేసుకుని ఆ వూరునుంచి వచ్చారు. ఆ గుంటల్లో బండివూపుకి అదిరిపోయి కీళ్ళుయావత్తూ సళ్ళువిడిచినై. ఇవాళ ఆమె కీళ్ళు స్వాధీనములో లేవు. సరిగదా ఆమె మనస్పృహలో కూడా లేదు.

దీన్ని తక్షణం బాగుచేయించక పోయినచో, ప్రస్తుతం అధికారంలో వున్న డిస్ట్రిక్టుబోర్డు మెంబర్లు సమర్థులైతే ప్రెసిడెంటుమీద విశ్వాసరాహిత్యం ప్రకటించి తీరాలి.

ఇట్లు,
*మాజీ డిస్ట్రిక్టుబోర్డు మెంబరు.*

ఇందులో తత్వం బోర్డు బాగుపడాలనే అవ్యాజ ప్రేమ కాదు. తను మెంబరుకాకుండా ఓడిపోయినా ననే నిస్పృహ, తద్వారా ప్రస్తుతం అధికారంలో ఉన్న డిస్ట్రిక్టుబోర్డు పైన యీర్ష్య యిందులో ధ్వనిస్తయి.

ఇంక అయిదోరోజున అయిదో ఉత్తరం వస్తుంది.

సంపాదకా !

అనంతవరం నుంచి అనంగపురం పోయే రోడ్డు మీద గుంటలు అఖాతాలని శ్రీ మాజీ డిస్ట్రిక్టుబోర్డు మెంబరు తెలిపినందుకు ఎంతయు కృతజ్ఞుణ్ణి. ఇప్పుడు కొన్ని సమస్యలు విడివడుతున్నాయి.

మా పాడిఆవు ఒకటి వారంక్రింద తప్పించుకు పోయింది. ఎంత వెదికినా కనబడటం లేదు. నూతులు, గోతులు యావత్తు గాలింపించాను. దొరకనందుకు ఆశ్చర్యపోయాను. ఇప్పుడు స్ఫురిస్తుంది. అది ఆరోజున ఈ రోడ్డుమీద వెళుతున్నట్లు మా స్నేహితుడు ఒకాయన చూశాడట. బహుశా అది ఈరోడ్డుమీద నున్న ఒక అఖాతంలో దిగిపోయి కూరుకుపోయి ఉంటుందని నా దృఢ విశ్వాసం.

డిస్ట్రిక్టుబోర్డువారు రోడ్డు బాగుచేయించినా, లేక చేయించకపోయినా నా నష్టం వారి అజాగ్రత్తవల్ల సంభవించింది గనక నా ఆవు ఖరీదు మటుకు ముదరా యివ్వవలసి ఉంటుంది. ఉట్టి ఖరీదే కాకుండా అది పోయిన రోజునించి ముదరా రొఖ్ఖం నాకు ముట్టేరోజువర్కూ నే కొన్న పాల ఖర్చు వడ్డీతోసహా చెల్లించుకోవాలి.

ఇట్లు,
స్వప్రయోజి.

ఈయన తననష్టాన్ని ప్రతివిషయంలో చూస్తాడు. ఏది సమంజసమో తనకి అనవసరం. ఎందులోనైనా తనబాధ ఉంటుందని, తనబాధ యితరుల బాధ కన్నా కొన్ని వేలరెట్లు బాధాకరమైనదని, తను తప్పు తలిస్తూ వారందరూ తన బాధ తీర్చడానికై సృష్టింపబడినట్లు భావించే రకం. ఏ పరిస్థితిలోనైనా స్వలాభాపేక్షని విడువని పట్టుదల ప్రతిబింబిస్తయి ఇతనిలో.

ఇక ఆరవ రోజున వచ్చే ఉత్తరం.

సంపాదకా !

మీ పత్రికలో ప్రకటితమయ్యే రోడ్డు అనంతపురంనుంచి అనంగవరం పోతుందా ? లేక అనంగవరంనుంచి అనంతపురం పోతుందా ?

ఒక సందేహి.

ఈ తత్వం వాళ్ళకన్నీ ధర్మసందేహాలే. ప్రతిదానికీ ఒక సందేహంతో అడ్డు తగులుతూ ఉంటారు. వాళ్ళకి సందేహాలు స్ఫురించే అంత శీఘ్రంగా సమాధానాలు స్ఫురించవు. నిదానించి చూస్తే ఆ సందేహాల్లో యేమీ ఉండదు. వాళ్ళనే చొప్ప దంటు రకం అంటాము.

ఇక ఏడవ ఉత్తరం.

మొన్న మీ పత్రికలో స్వప్రయోజిగారి ఆవు రోడ్డుమీద ఓ గుంటలో కూరుకుపోయి కనబడకుండా పోయిందంటే చాలమంది నమ్మటంలేదు. అది ఒక లెఖ్ఖా ! నిన్న నేను అటు పోతుంటే ఆ రోడ్డుమీద ఒకటోపీ బోర్లించి పడివుంది. అది ఎవరిదో పోయిందని ఊడ్చి ఒక తన్ను తన్నాను. అది లేచేప్పటికి ఆశ్చర్యము ! దానిక్రింద ఒక తలకాయ కనబడ్డది. ఇది ఎవరో గొంతుకోసి యిక్కడ పడేశారు అని దగ్గరగా పోదునుకదా అది బతికుంది. అప్పుడూ పాపం ఎవరో మనిషి ఇందులో గొంతు కూరుకుపోయినాడని తోచి సాయం పట్టేదా అని అడిగాను. అతడు వద్దువద్దు నేను ఒక బస్సుటాప్ మీద నిలుచొని ప్రయాణం చేస్తున్నాను అన్నాడు.

ఈ సంఘటన నిజమైనప్పుడు, ఆవు సంగతి నిజం కాకుండా ఉంటుందా ?

ఇట్లు,
విదూషకుడు.

ఇది పూర్తి వినోదం. అసంభవాన్ని సంభవం క్రింద చెప్పి నవ్వించడం.

ఇక ఎనిమిదవ ఉత్తరం వస్తుంది.

సంపాదకా!

తమ పత్రికలో ప్రకటిత మవుతున్న అనంతపురం రోడ్డు గురించిన చర్చ చూస్తున్నాను. అందులో ఎవరు సూచించినా రోడ్డు బాగుచేయించమంటున్నారే కాని ప్రగతి కనపరచడం లేదు. రోడ్లు అనేవి పూర్వకాలంవి. ఏదో అశోకుడు కాలానికి సరిపోయే పనులు. మనం ఇరవయ్యో శతాబ్దం మనుష్యులం. ప్రపంచం సర్వతోముఖంగా పురోగమించింది. మనం కాలానుగుణంగామారాలి. యంత్రయుగం వచ్చేసింది. మళ్ళీ మట్టితో రోడ్డు వేయించకపోతే అంతే ఖర్చుతో ఇనుపదారి వేయించి ఎందుకు ట్రాములు నడిపించకూడదు? ఈ ట్రాముకై నిర్మించే పవరుహౌసుతో అనంతపురానికీ, అనంగవరానికీ దేదీప్యమానంగా విద్యుచ్ఛక్తి సరఫగాచేసి ఖర్చు తగ్గించవచ్చు. తద్వారా అన్ని పనులు సానుకూలము లగును. ఎలక్ట్రిక్ చకచకావస్తే పంపులక్రింద మెరకభూములలో వరి పండించవచ్చు. ప్రస్తుతం బొగ్గుతో పని చేస్తున్న ఫ్యాక్టరీలను పదోవంతు ఖర్చుతో ఆడించవచ్చు. ఇక ప్రయాణీకులకు ట్రాముటికెట్టు బహు చౌక. ఈ సౌకర్యంవల్ల రాకపోకలు తద్వారా వాణిజ్యం, తద్వారా సిరిసంపద వృద్ధి చెందుతయి.

కనుక యిప్పటికైనా యంత్రాలవల్ల లాభం గమనించి తిరిగి మట్టిరోడ్డు వేయడంవల్ల ప్రజల సొమ్ము మట్టిపాలు చేయకుండా కాపాడి, ట్రాములు వేయించి ఆ పరిసరం యావత్తూ 'శ్రీలు పొంగే జీవగడ్డ' చేయమని నా విజ్ఞాపన.

ఇట్లు
*పురోగామి*

వీరి తత్వం మనదేశం వెనకబడి ఉన్నదని, ఇతర దేశాల ఆధిక్యతకు కారణం వారి పారిశ్రామిక పురోగమనమేనని నమ్మకం. విద్యుచ్ఛక్తి, దానివల్ల ప్రయోజనాలు, యంత్రాలు అవి సాధించగల ఆర్థికౌన్నత్యం, తద్వారా కలిగే శక్తే సరియైన శక్తి అని ఈయన సిద్ధాంతం.

దీని తరువాత తొమ్మిదో ఉత్తరం యిలా వస్తుంది.

సంపాదకా!

మీ పత్రికలో అనంతవరం రోడ్డుమీద శ్రీ పురోగామిగారు రాసిన లేఖ చూచాను. ఆయన రోడ్డుమీద ట్రాములు వేయించమంటున్నారు. ప్రస్తుతం ఆరోడ్డుమీద ఉన్న గుంటలో స్వప్రయోజీ గారి ఆవు, విదూషకుడిగారి బస్సే మునిగిపోయినప్పుడు ట్రాముట్రామే మునిగిపోవచ్చు ననడం ఆశ్చర్యం కాదు.

అదీగాక ప్రస్తుతం ట్రాం కంపనీలు ఎక్కడ చూచినా లాభాలులేక దెబ్బతిని బందవుతున్నయి. ఇక ట్రాములు నేలమీద నడుస్తుంటేనే ట్రాం కంపనీలు మునుగుతున్నప్పుడు, ట్రాంలే మునిగిన పక్షంలో ట్రాం కంపనీలు పాతాళంలోకే వెళ్ళయిగనక ట్రాంలు వేయడం శ్రేయస్కరం కాదు.

ఇట్లు
*ప్రతిపక్షి*

ఈయన తత్వం ఇతరులు చెప్పింది కాదనటం. ఈయనకు ఇది విషయమా? కాదా? అన్న విషయం అనవసరము. ఇతరులు ఏది ప్రోత్సహిస్తారో దాన్ని ఖండించడం, ఏది ఖండిస్తారో దాన్ని తలదాల్చడం అలా చేయటంవల్ల తన ప్రత్యేకత ఆధిక్యత నిర్ధారణ అవుతయ్యాని ఊహ. తను అందరిలాగా పామరుణ్ణి కాదని నిరూపించాలనే తృష్ణ యిందులో అంతర్లీనమై ఉంటుంది.

ఈ కథ ఇలా పెరిగిపోతుంటే యీ ఉత్తరాలకి అంత మెప్పుడు? ఒకవేళ లేదేమో అనిపిస్తుంది. ఇలాంటి ఉత్తరాలను నిర్నిమిత్తంగా చదివే చదువరి వీటికి అంత్యం ఎలాగొస్తుందా అని తికమకలుపడి గందరగోళమౌతాడు. కాని ఇలాంటి ఉత్తరాలు

ఊరికినే అనుకోని విధంగా మెలిక తిరిగి అంత మవుతవి.

ఇక పదో ఉత్తరం.

మీపత్రికలో పరంపరాభివృద్ధిగా ప్రకటితమవుతున్న అనంతవరం రోడ్డుగురించిన ఉత్తరాలు మా సెక్రటరీ చదవగా విన్నాను. నేను బాగుచేయించాలనే ఉద్దేశంతో మాఫైల్సు తిరగవేయించగా మా రికార్డులలో ఎక్కడా యీ రోడ్డు ఉన్నట్టే లేదు.

ఇట్లు
*రావ్ బహదూర్ ఫలానావారు*
డిస్ట్రిక్టుబోర్డు ప్రెసిడెంటు

దీనితత్వం ఏమిటో శ్రోతలే ఊహించాలి. తత్వం ఏదైతేనేం, యీ ఉత్తరం ఇందాకట్నించి కట్టిన మేడని పునాదులతో సహా లేపివేసింది. మనని యీకథ కురికించి కికురించి తారాజువ్వలాగా పైకి లేచి ఒక్కసారి పేలి ఆరిపోయింది. ఇదే సంపాదకునికి లేఖలు కొన్నింటిలో ఉండేమజా. ఇలాగే అనేక రకరకాల వాటిలో, రకరకాల మజా మనకి కనిపిస్తుంది. కొన్ని రకాలవాటిలో అంతులేని వాగ్యుద్ధాలు బయలుదేరి, మామూలు ధోరణిలో అయితే యిట్టే పరిష్కార మయ్యే సమస్యలు పద్మవ్యూహాలుగా తయారవుతవి. ఒకడైతే సమస్యకు ఒక సమాధానం చెబుతాడు. పదిమంది అయేప్పటికి, పది సమాధానాలు చెప్పే సదుద్దేశంతో పది సమస్యలు తీసుకవస్తారు.

ఇవి కల్పించే కథలు అనేక రకాలు. ఇవి గల్పికలు, అభూతకల్పనలు కావు. కొన్ని గోడమీద పిల్లులు, కొన్ని గోడమీద బొమ్మలు, బొమ్మలాగా అచేతనములు, పిల్లిలాగ నిగూఢములు. కొన్ని కథలు 'సత్యం' వలె సమగీతమీద నడుస్తయి, కప్ప వలె దూకుతయి. శకటులాగ దాటుతై. ఈ చిత్ర విచిత్ర గమనాలు గమకాలు సంపాదకుల లేఖలు అల్లే కథలలో గమనించవచ్చు.

కొన్ని ఉత్తరాలు ఒక ఉత్తరంతోనే అంతమవుతవి. అవి సామాన్యంగా ఫలానా ఊళ్ళో చౌర్యం ప్రబలింది, ఫలానా ఊళ్ళో పాఠశాలకు ఆటస్థలం లేదు. ఫలానా చెరువుకు కప్పులేచిపోయిందిలాంటివి. ఇవి సర్వజన సమ్మతిగల కోర్కెలు. వీటిది ఏకచ్ఛత్రాధిపత్యం. ఇంకోరకం రెండు ఉత్తరాలతో అంతమవుతవి. అవి సామాన్యంగా ఫలానావారి ప్రవర్తన జుగుప్సాకరం, ఫలానావారు రాసిన ఫలానా గేయం బాగులేదు లాంటివి. ఇవి తిర్గి ఆ ఫలానావారు జవాబు చెప్పడంతో ఆగిపోతవి. వీటిది ద్వంద్వప్రభుత్వం. ఇక మూడింటితో అంతమయేవి కొన్ని. ఒకరు రాస్తారు, మరొకరు జవాబు చెబుతారు. దాంతో మొదటివారు ఉపసంహారం చేస్తారు. లేకపోతే మూడోవారు, ఈ రెండు కల్పించిన ఘర్షణల్ని మలచి సాఫీచేయడంలో అంతమయేవి. ఈ రకాన్ని త్రైమూర్త్యం అనొచ్చు. ఇది దాటితే చతుష్టయం చేతులోపడి నలుగుర్లో పడటం జరుగుతుంది.

ఈ ఉత్తరాల అవకాశాలు విశాలమవటంచేత అన్ని కాలాల విషయాలు చర్చించడానికి తగివుంటయి. ఈమధ్య వస్తున్న ఉత్తరాలలో "కాఫీ మొక్క పుట్టుక" "పర్వెంచైనా మొక్క లతా లేక పొదా" అన్న చర్చలాంటివి భూతకాల సంబంధమైనవి. ఇక పంచదార ధరల తగ్గుదల, అంతర్రాష్ట్రీయ వ్యాపారంమీద అమ్మకంపన్ను (Inter-States Sales-tax) కేంద్రకర్ణాటకపాఠశాల, గోదావరి వరదలు, భూదానయజ్ఞం లాంటివి వర్తమాన విషయాలు. ఇక కొరియాసంధి శాంతికి దోహదమా? పట్టుకవెళ్ళిన పిచ్చికుక్కల్ని కార్పొరేషను పిచ్చి తగ్గితే వదలి పెడుతుందా? చెడిపోయిన విమానాలు పడిపోకుండా వాటిని గాలిలో నిలబెట్టడం ఎలా అన్నవి భవిష్యత్తు సంబంధమైనవి. అందుకే ఇవి భూతభవిష్యద్వర్తమానాల్లో ప్రవహించే జీవనదులు.

పిటికితోడు మానవత్వం నిరూపిస్తయి గనుక మానవుడిలా యివి చిరంజీవులు.

ఇవి జీవనదులు. చిరంజీవులు కూడా.

పోణంగి శ్రీరామ అప్పారావు

# రససామగ్రి-రసానుభూతి

"విభావ - అనుభావ - వ్యభిచారుల సంయోగము వలన రసము నిష్పన్నమగును" అని భరత సూత్రము.

ఈ రసమునుగూర్చి ఆధునిక విమర్శకు లనేక వ్యాసములను వెలయించినారు. వారితో పోటీచేయుట నా ఉద్దేశము కాదు. ఆ పరిభాషను, నా నేర్చిన విధముగా, సుగమముచేసి చెప్పుటకే ఈ నా ప్రయత్నము.

## రససామగ్రి

రసానుభూతి అందఱకును కలుగదు. ఆ అనుభూతి సంస్కారవంతులయిన సహృదయులకు మాత్రమే కలుగును. సంస్కారమనగా రత్యాది భావములను ఆస్వాదించగలిగి ఉండుట. ఈ భావములు అప్పటి కప్పుడు కలుగునవి కావు. బీజరూపమున సహృదయుల మనస్సులలోనే ఉండును. ఈ బీజములు (రత్యాదిభావములు) మొలకెత్తుటకు అవకాశము కలుగు పర్యంతము సుప్తరూపమున హృదయమందు అణగి ఉండును. వీనికే 'వాసనలు' అని పేరు. ఈ వాసనలు సుప్తరూపమున నున్న స్థితియే 'నిర్వికారాత్మక చిత్తస్థితి.'

హృదయాకర్షకమైన సన్నివేశము, లేదా వస్తువు, లేదా వ్యక్తి హేతువుగా సుప్తరూపమున నున్న రత్యాది భావములు ఉద్బుద్ధము లగును అనగా మొలకెత్తును. ఇట్లు రత్యాదు లుద్బుద్ధములగుటకు హేతువైన సన్నివేశము, లేదా వస్తువు లేదా వ్యక్తి 'విభావ' మనబడును. (లోకమున దీనిని 'కారణము' అందురు. విభావమునందు అర్వాచీనాలంకారికులు చెప్పిన ఆలంబన - ఉద్దీపన భేదములను భరతుడు చెప్పలేదు. అట్టి విభజనము కాల్పనికమని అభినవ గుప్తు డభిప్రాయపడెను.)

తడి తగిలిన వెంటనే బీజమునుండి మొలక వచ్చినట్లుగా శక్తిసంపన్నమును విశిష్టమును అగు ఈ విభావమాధారముగా సుప్తరూపముననున్న రత్యాదులు ఉద్బుద్ధము లగును. ఇతఃపూర్వము నిర్వికారముగా నున్న చిత్తమునం దిట్లు ఉద్బుద్ధములగు వానినే 'భావములు' అందురు. అనగా విభావమాధారముగా మనస్సునందు కలిగెడి ప్రథమవికారము లేదా చిత్తవృత్తి విశేషము 'భావము' అనబడును. (విభావము కారణము, భావము కార్యము.) ఈ భావములు స్థాయి - వ్యభిచారి - సాత్త్విక భేదములచే ముత్త్రివిధములుగా నుండును.

అట్లు ఉద్బుద్ధమైన భావము చంచలము కాక రసస్ఫూర్తివఱకును స్థిరముగా నుండవలయును. ఇట్టిభావమునకే 'స్థాయిభావము' అని పేరు. ఏవిధమైన ఇతరభావ సంపర్కము కలిగినను మార్పునకు లోనుకాక, ఆ భావములనుకూడ తనలో లయింపజేసికొనగల లేదా తనకు పోషకమగునట్లు చేసికొనగల దృఢత్వము కలదే 'స్థాయిభావము' అనబడును.

విశిష్టమగు సన్నివేశము ఆధారముగా సహృదయుడగు వ్యక్తి హృదయమున మొలకెత్తి, ప్రకాశమును కాంచి, రసీభావమును పొందుపర్యంతమును నిలిచియుండు భావము 'స్థాయిభావ'మగునని సారాంశము.

ఇట్లు స్థిరపడిన భావములు విభావబలమున హృదయమున వికాసము కాంచును. ఇదియే రసోన్ముఖమైన స్థితి. అట్లు హృదయమున వికాసమునొందిన స్థాయిభావములు నాయికా - నాయకుల (వారితో అభేదమును చెందిన సహృదయులగు సామాజికుల)

మనో దేహములపై ప్రాబల్యమును వహించి వారిని అనేకములగు ప్రవృత్తులకు లోను జేయును. ఈ మార్పులు హృదయవికాసమునకు వెనువెంటనే కలుగునవి కాన వీనికి 'అనుభావములు' అని పేరు. ఈ అనుభావములు రెండు రకములు. వ్యక్తి ప్రయత్నపూర్వకముగా చేయు కటాక్ష - భ్రూవిక్షేపాదులు మొదటి రకము ; ఇవి కేవలానుభావములు. ఇందులకు హృదయము పూర్తిగా భావావిష్టము కానక్కఱలేదు.

ఇంక వ్యక్తి ప్రయత్న మేదియును లేకయే దేహమునందు చూపట్టు అనుభావములు రెండవ రకము. వీనికి "సాత్త్విక భావములు" అని పేరు. హృదయములు పూర్తిగా భావావిష్టములైనప్పుడే ఈ భావములు వ్యక్తము లగును. సత్త్వ మనగా హృదయగత భావములను పైకి ప్రకాశింపజేయు మానసిక వ్యాపారము (సాత్త్విక భావములు కూడ నిజమునకు అనుభావములే కాన రససూత్రమందు ఇవి వేఱుగా పరిగణించ బడలేదు.)

స్థాయి భావప్రాబల్యమున ఇట్లు దైహికములగు మార్పులు మాత్రమే కాక, మనస్సున పెక్కు భావ పరంపరలు ఉద్బుద్ధము లగుటయును కలదు. ఈ భావపరంపరనే 'వ్యభిచారి భావములు' లేదా 'సంచారి భావములు' అందురు. ఈ భావములు హృదయమున స్థిరముగా నిలువక వెంటవెంటనే పుట్టుచు, లేచుచు, అడగుచు నుండును. కావుననే వీనిని సముద్రపు టలలతో పోల్చుచుందురు. ఇవి స్థాయి భావములను దృఢతమము చేసి రసాభిముఖముగా నడిపించును. (అనగా రసమును సహృదయులగు సామాజికులకు అభిముఖము చేయును.)

పైన పేర్కొనబడిన విభావ, అనుభావ, సాత్త్విక, వ్యభిచారి భావములచే పై విధముగా ఆస్వాద్యత్వమును పొందిన స్థాయిభావమే 'రసము' గా అభివ్యక్త మగును. 'రసము' అనునది 'ఆనందము'నకు పర్యాయ పదము.

## రసానుభూతి

రసానుభూతి పొందుటకు సామాజికుడు నాలుగు క్రమదశలను దాటవలసి ఉన్నదనియు, ఐదవదానిలో ఆనందానుభవము కలుగుననియు అభినవగుప్తుని సిద్ధాంతము. వానిని క్రింద వివరించుచున్నాము—

1. హృదయసంవాది అయిన విభావము సామాజికుని కనులను, చెవులను విప్పారజేయును.

2. దర్శన - శ్రవణముల వలన సామాజికుడు భావన చేయుటకు మొదలుపెట్టును. ఆ భావనవలన క్రమముగా అతడు ఆ విభావముయొక్క పరిమిత బాహ్య స్వరూపమునేకాక అందు దాగియుండి, బాహ్యేంద్రియములకు కన్పట్టని విశిష్ట ధర్మమును, అనంతత్వమును దర్శింప గలుగును. ఇందులకు రంగమున ప్రదర్శితమగు, కావ్యమున వర్ణితమగు అనుభావాదికము దోహదము చేయును.

3. ఇట్లు విశిష్టదర్శన మైనంతనే వాని ప్రవృత్తియే మాఱిపోవును. ఇప్పుడు వానికి యెదుట కన్పించు విభావాదులతో పనిలేదు ; వాని అంతర్యమును గూర్చి తాను భావనచేసిన విశిష్ట స్వరూపమే వాని మనః ఫలకమునెదుట నిలిచియుండును. అనగా సామాజికుడు లౌకిక ప్రవృత్తినుండి మరలి స్వీయ సృష్టి అయిన ఒకానొక భావనాలోకమున సంచరించును. ఆ స్థితిలో, అతడు, పునఃపునరనుసంధానముచే తన భావనకు కారణమైన విభావముతో తాదాత్మ్యమును పొందును. అనగా నాయకాద్య భేదమును పొంది, సాక్షాత్తుగా తదనుభవమునే తానును పొందుట కభిముఖు డగును ; వెనువెంటనే నాయకాదుల ఆవేశాదు లెట్టివో అట్టివే వీనికిని కలుగగలవు, అనగా వారి సుఖ-దుఃఖములనే యాత డనుభవించుచుండును. ఇదియే సత్త్వస్థితి. సామాజికుని లేదా పాఠకుని ఇట్టి స్థితిని పొందింపగల ప్రయోగము లేదా కావ్యముమాత్రమే ఉత్తమమని తెలియవలెను.

4. ఇట్లు సాక్షాన్నాయకాద్యనుభవమునే పొందుచు, ఆ భావ తీవ్రతకే లోనైన సామాజికుడు క్రమముగా తన్ను తాను మఱచిపోవును. అనగా అతడు స్వపర

భేదములకు కారణమైన వ్యక్తిత్వమునే కోల్పోవును. ఇట్టి అలౌకిక స్థితికే 'సాధారణీకరణము' అని పేరు. సంభావన సరిగా లేకపోవుట మొదలగు ఏడు విఘ్నములను తరించినప్పుడే సామాజికు డిట్టి స్థితిని పొందగలడు.

5. ఈ సాధారణీకరణస్థితిలో సా మా జి కు ని బాహ్యేంద్రియములు పనిచేయుట పూర్తిగా మాని వేయును. స్థాయితో కూడిన మనస్సు, ఆనందముతో కూడిన ఆత్మ - ఇవి రెండు మాత్రమే పనిచేయు చుండును. ఇదియే బ్రహ్మానందసబ్రహ్మచారి అయిన స్థితి.

అసలు ఆత్మ ఆనందస్వరూపము. కాని దానిని అజ్ఞానము ఆవరించి ఉండును. ఆ అజ్ఞానము తొలగినచో ఆనందము స్వస్వరూపముతో ప్రకాశించును. విభావచర్వణమువలన ఆ అజ్ఞానావరణము తొలగును. అప్పుడు అనుభావాదికమువలన తనలో వికసించెడి రత్యాది వాసనలే ఆత్మానందముగా పిమ్మట అభివ్యక్తము లగును. ఇట్లు ఆనందముతో సంవలితములైన రత్యాదులకే రసములనిపేరు. ఇది అభినవ గుప్తుని 'అభివ్యక్తి' సిద్ధాంత తాత్పర్యము. విభావాదికమును చర్వణము చేయుచున్నంత కాలమును సామాజికునకు, లేదా పాఠకునకు ఈ రసానుభూతి ఉండును.

ఈ రసానుభూతి అందఱకును కలుగదని ముందే చెప్పియున్నాను. సంస్కారవంతులైన సహృదయులకైనను ప్రతిరూపకమువలన లేదా ప్రతి కావ్యమువలన రసానుభూతి కలుగదని తెలియవలెను. నాయకుడు ఉత్తముడై, వాని చరిత్రలోని ఆకర్షణీయమగు ఘట్టము చిత్రితమైనప్పుడే తద్దర్శన, శ్రవణములవలన రసానుభూతి కలుగగలదు. కావుననే మన పూర్వులు మహాకావ్యమును, రూపకములలో నాటక ప్రకరణములను మాత్రమే ఉత్తమములనుగా గ్రహించి వానియందు సర్వలోక ప్రీతికరములగు శృంగార వీరములనే పోషించినారు. నాయకు డాదర్శప్రాయుడును, రసములు శృంగారవీరములును, కానిచో 'సాధారణీకరణ' మనెడి స్థితియే కలుగదు. కావున ప్రహసనాదులు కేవలముమనఃప్రీతికరములుమాత్రమే; వీనివలన 'poetic relish' అనునది కలుగునేకాని 'రసానుభూతి' అనునది కలుగదు.

# శరత్సరస్వతి | బోయి భీమన్న

సరస నీలోత్పలమ్ములై జలదమాలి
కాళి నీ సేవ మున్గి ఆత్మార్పణమున
లావు నాశిల్లి వాడి వెల్లనయిపోయె;
రమ్ము శారద! అమృతపాత్రమ్ముతోడ.

బెంగను క్రాగియున్న గిరి ప్రేముకు డంబుదకాంత గూడి నొ
వ్వంగ కవుంగిలించి సుఖవార్నిధి మున్గుచు తేలుచుండి ఆ
యంగన లేచిపో తివుచు నప్పుడు చిక్కిన చీరకొంగు నా
కొంగల బారు కాంచు మదిగో! దిగుచున్నది పైరు మళ్లపై!

ముసురు వానలలో చుట్టి మూలబెట్టి
ఆరగట్టిన రైతుల యాస లనగ
ఆశలు వినిర్మలము లయ్యె; ఆకసమ్ము
చూర యిచ్చెను నీ పాల తేరు చూచి!

సిరికిన్ తోడువు నీకు స్వాగతముగా చే లొప్పుగా పండి బం
గరు వెన్నుంగయిమోడ్పు టొదలల సాగన్ మ్రొక్కు; మా చంద్రశే
ఖరు చూడామణి శోభ పౌటను త్రిలింగస్థాని కోర్వీధర
స్ఫుర దుద్యత్సుభగత్వ మెల్ల నదె నిన్ పూజింప మిన్నంటెడిన్!

వానలు వరదలు గాలి తు
పానులు చల్లారి, విప్లవానంతర తీ
ర్మానము వలె విశ్వము నీ
యానందోత్సవ పతాకమై తేరుకొనెన్!

శివుని తల మీది గంగ పెల్లెవసి శివునె
శివము త్రొక్కించి వరదలై చెంగలింప
శివుని సౌభాగ్య మెల్ల పిచ్చిలిన నీవు
శివుని ముంచెత్త శివమయ్యె భువనకోటి।

నీ విజయమె అపరాజిత
నీ వేడ్కయె ధూప దీప నీరాజనముల్
నీ విభవమె పరిపూర్ణిమ
నీవె జగజ్జీవ జీవనేశత్వమవున్।

ఇది వైకుంఠము వేంకటేశ్వరుడు లక్ష్మీశుండు కొల్వుండుటన్;
ఇది కైలాసము మల్లికార్జునుడు ఆర్యేశుండు చెల్వొందుటన్;
ఇది బ్రహ్మోర్వి సరస్వతీ చరణ పంకేజాతమైయుంట; లో
క దృగానందక మాంధ్ర; మిందు దిగుమా కల్యాణ తాదాత్మ్యవై।

పరువెత్తుచున్న లేడి పట్టి లేడియేకాక, చాల యర్థములకు విధానముగ నూహింపబడుటలో నొక యర్థము కావ్యవస్తువనికూడ తెలిసికోఁబడవలయుట చెప్పబడినది. ఇందు రెండవచరణము "పశ్చార్ధేన ప్రవిష్టశ్శరపతనభియా భూయసా పూర్వకాయం" అన్నదానిలో కథాగత తాత్పర్యము సువ్యక్తముగా కనిపించుచున్నది. శరపతన భీతిచేత వెనుకటి సగము ముందునగములో జొచ్చుకొన్నది అని. ఈ శ్లోకమైనంతనే "కథ మనుపతత ఏవ మే ప్రయత్న ప్రేక్షణీయ స్సంవృత్తః" అనుసరించుచునే యున్నాను. ప్రయత్నముచేసినగాని కనిపించుటలేదు. అనగా చాలదూరము పోయినదని యర్థము. ఈ యర్థము లేడి విషయములోకంటె శకుంతలావిషయమున నెక్కువ నిజముగా నున్నది. రాజు శకుంతలను చూచినాడు. ఆమెయం దనురక్తుడైనాడు. ప్రియంవదానసూయలు వివాహసంబంధి ప్రసంగము చేయువరకు నామెయందు బద్ధ మనస్కుడైనాడు. 'ఇదం కిలావ్యాజమనోహరం వపుః — సరసిజ మనువిద్ధం శైవలేనాపి రమ్యం — అధరః కిసలయ రాగః' ఈ మొదలయిన ప్రవృత్తి చాలవరకు సాగినది. అప్పుడు శకుంతలతో ననసూయ వనజ్యోత్స్న కథ ప్రారంభించినది. ప్రియంవద "యథా వనజ్యోత్స్నానురూపేణ పాదపేన సంగతా ఏవం నామాఽహ మపి ఆత్మనోఽనురూపం వరం లభేయ మితి" ఈ యూహతో శకుంతల వనజ్యోత్స్నను అతి మాత్రముగా చూచుచున్నదని ప్రియంవద చమత్కరించినది. శకుంతల దానికి సమాధానముగ "ఏష నూనం తవాత్మగతో మనోరథః" ఇది నిజముగా నీ మనస్సులోనున్న కోరిక అని - ఇతి కలశ మావర్జయతి. ఇది నీ మనస్సులోని కోరిక యనగా లోకసామాన్యముగాఁ జూచినచో నీకుఁ దగినభర్తను సంపాదించుకొనవలెనని నీవే కోరుచున్నావు, నాకట్టి కోరికలేదు. అని వ్యతిరేకార్థము విచ్చుమాట. కాని శకుంతల యనురూపవరుని పొందవలయునని ప్రియంవద వాంఛించుటయు నిజమే. అట్టివాంఛ ప్రియంవదకుఁ గలదని శకుంతలకుఁ దెలియును. శకుంతల మాటలన్నియు లజ్జచేతవలె, నసూయచేతవలె నన్నట్లు కనిపించి యామె హృదయగతవాంఛను తనయం దాచెలికత్తెలకుగల యనురాగమును సూచించుచున్నది. ఈమాట యని శకుంతల కుండెడు నీళ్ళు వనజ్యోత్స్నయొక్క యాలవాలమున నింపినది. కోపము వచ్చినపుడు మానవు లిట్లే చేయుదురు. కొంచెము నీళ్లు పోసినచో, జాలునేమో. కుండెడు నీళ్ళచ్చుటనే యొలికించినది. ఈ క్రియచేత కవి శకుంతలయొక్క సర్వమనోభావమును వ్యక్తీకరించినాడు. ఆమె తన సర్వస్వము తన భర్త కర్పించు నన్నట్లుగా నీ కలశావర్జనము మహాధ్వని విచ్చుచున్నది.

అంతవరకు, తత్సౌందర్యచర్చా నిమగ్నుడైన రాజునకు దానిలోని క్లిష్టత తెలియలేదు. ఈ వివాహ ప్రసక్తి వచ్చుటయు, శకుంతల కలశావర్జనము చేయుటయు రాజునకు జాగ్రదవస్థా హేతుకములైనవి. అప్పుడు "దుర్లభః ఖల్వేష మనోరథః. అపి నామ కులపతే రియ మసవర్ణక్షత్రసంభవా స్యాత్" అన్న సందేహము పుట్టినది. ఇది నిజముగా గడ్డు సమస్య. ఇంతవరకు సాగిన ప్రవృత్తికి విచ్ఛిత్తి స్థానము. ఈ యర్థమునే ఈ ఘట్టమునే, ఈ సంశయమునే, "కథ మనుపతత ఏవ మే ప్రయత్న

ప్రేక్షణీయ స్సంవృత్తః" అన్న వాక్యము చెప్పుచున్నది. "అనుపతత ఏవ మే" అనగా నా మనస్సు తదభిలాషాప్రవర్తిత మగుచుండగా నామె ప్రయత్న ప్రేక్షణీయురా లగుచున్నది. ఆమె జన్మవృత్తాంత రహస్యము తెలియక నేనామెను వివాహమాడలేను. ఆమె క్షత్రపరిగ్రహయోగ్య గాదు. అన్న సంశయము ప్రయత్న ప్రేక్షణీయముగాఁ జెప్పబడినది.

అప్పుడు సూతుడు "ఉత్ఖాతినీ భూమిరితి మయా రశ్మి సంయమనా ద్రథస్య మందీకృతో వేగః; తేన మృగ ఏష విప్రకృష్టాంతర స్సంవృత్తః సంప్రతి సమదేశవర్తిన స్తేన దురాసదో భవిష్యతి." భూమి మిట్టపల్లములుగా నున్నది. అందుచేత రథ వేగమును తగ్గించినాను. మృగమునకు నీకు నడుమ దూర మెడమైనది. ఇప్పుడు నీవు సమదేశమున నున్నావు అది నీ కిపుడు దురాసదము గాదు. భూమి యిచ్చట నుత్ఖాతిని. ఈ వాక్యముయొక్క యర్థమే "అపినామ కులపతే రియి మసవర్ణక్షత్రసంభవా స్యాత్" అన్నది. తాను క్షత్రియుడు. ఆమె బ్రాహ్మణస్త్రీ. ఇద్దరి నడుమ వివాహము ధర్మముగాదు. ఇది మెట్టపల్లములని చెప్పబడుట. బ్రాహ్మణవర్ణము కొంచెము మెరక. క్షత్రియ వర్ణము కొంచెము పల్లము. శకుంతలాభిగతాభిలాషా రూపమైన శృంగార రసమునకు ప్రచలనము తగ్గినది. సూతుడు రశ్మిసంయమము చేసినాడు. ఈ సూతుడు బ్రహ్మయా? నాటక గత వక్త్రినపేక్షయా ధ్వని ప్రవర్తించవచ్చును. కాని 'మయా మన్దీకృతో వేగః' నేను వేగమును తగ్గించినానని సూత ప్రాధాన్య వివక్షచేత ధ్వని ప్రవర్తించినను, దానియందు కొంత వెనుకకు లాగుట జరుగవచ్చును. అందుచేత సూతునకుఁ గూడ కొంత ప్రాధాన్య మీయవలెను. ఆ ప్రాధాన్య మెట్టిది? ఈ ప్రాధాన్య మీమాంస చమత్కారముగా నుండవచ్చును.

ఇక్కడ ధ్వనికిని కావ్యవస్తువునకును నభేద ప్రతిపత్తి. ప్రస్తుతము రథవేగము; అప్రస్తుతము శకుంతలా జన్మవిషయ వృత్తాంత విచారణ. కొద్దిలో నదియు జరుగబోవుచున్నది. దాని కీ మాటలు ప్రతిబింబములుగా నున్నవి. దీనియందది ధ్వనిత మగుచున్నదని చెప్పుటయే కాని వ్యంగ్య వ్యంజక పరమ సన్నిహితత్వ సన్నికర్షలచేత నభేద ప్రతిపత్తి భ్రాంతి గల్గుచున్నది. ఇదిగో ఇప్పుడు సమప్రదేశమును చేరినావు. నీ కా మృగము దురాసదముఁ గాదు. రశ్మి సంయమనము చేసినది సూతుడు. సమ ప్రదేశము చేరినది దుష్యంతుడు. అది మృగము. మృగ్యత ఇతి మృగః. స్త్రీ వెదుకదగినది. న రత్న మన్విష్యతి మృగ్యతే హి తత్. స్త్రీగతమైన యీ భావము కాళిదాసుని మనోనిష్ఠితమైనది. మృగశబ్దముచేత శకుంతల సూచింపబడుచునే యున్నది. భూమియొక్క యుత్ఖాతినీత్వ లక్షణమునకు దుష్యంతునకు సంబంధము లేదు. మృగము విప్రకృష్టాంతర మైనది. రశ్మిసంయమన మనగా వ్యంగ్యతః యీమె క్షత్ర పరిగ్రహయోగ్య యగునా కాదా యన్న విచారణ కావలయును. అనగా శకుంతలా దుష్యంతుల భిన్న వర్ణత్వము భూమియొక్క మెరక పల్లము లైనచో మృగశబ్దముచే శకుంతల సూచితయైనచో రశ్మిసంయమనము తద్గత మీమాంస కావలయును. సమప్రదేశ వర్తిత్వము ఆమె విశ్వామిత్ర సంభవ అని తెలియుట యగును అప్పుడు మెరకపల్లములు లేవు. కాని రశ్మిసంయమనము చేసినది సూతుడు సమప్రదేశవర్తియైనవాడు రాజు. రథము సమప్రదేశ వర్తియని చెప్పరాదా? నేను పగ్గములు బిగపట్టితి నని చెప్పుటయెందులకు: పగ్గములు బిగబట్టబడినవి. అని వాక్యమును కర్త్రనపేక్షముగా వాడవచ్చును. అందుచే నిచ్చట సూతుడొకడున్నాడు. రాజొకడున్నాడు. ఆగామి కథ దీనియందు సూచ్యమైనచో సందేహము కలిగినది రాజునకే. సందేహము తీరునది రాజునకే. అక్కడ నిద్దరు రాజులులేరు. కాని యిద్దరు రాజులున్నారు.

ఈ నాటకమంతయు నిద్దరు దుష్యంతులమీద నిర్మింపబడినది. ఒకడు సామాన్యుడై లోకమునందు ప్రవర్తించువాడు. రెండవవా డసామాన్యుడై యంతఃకరణమునందు జాగృతుడై ప్రవర్తించువాడు. రశ్మి సంయమనము చేసినది సూత స్థానీయుడైన రాజు.

అనగా విచారణాశీలుడైన రాజు. అనగా బ్రహ్మ. మనస్సును సృష్టించినవాడు. సమప్రదేశ వర్తిత్వ లక్షణ స్థాపకుడైన రాజు శివుడు. ఆయనయున్నాడు. ఆయన సర్వనియంత. ధర్మమార్గోపదేష్ట. ఈరీతిగా సూతుడు సూతుడుగాడు. సూతునకు రాజునకు నభేదా ధ్యవసాయము.

అపుడు రాజన్నాడు. అందుచేత పగ్గములు వద లుము (తేన హివిముచ్యన్తా మభీశవః). శకుంతల విశ్వామిత్రసంభవయని తెలిసినంతనే శృంగార రసము ప్రవర్తించుచున్నది. కథ సాగుచున్నది.

ఆ కథ యెట్టిది ః సూతుడు రథవేగమును నిరూపించుచున్నాడు.

ముక్తేషు రశ్మిషు నిరాయత పూర్వకాయాః
నిష్కమ్పచామర శిఖానిభృతోర్ధ్వకర్ణాః
ఆత్మోద్ధతై రపి రజోభి రలఙ్ఘనీయాః
ధావన్త్యమీ మృగజవాక్షమయేవరథ్యాః.

రశ్ములు వదలిపెట్టబడగా- రశ్మి యనగా వ్యాపించునది అని వ్యుత్పత్తి. ఈ భాగములోనున్న యర్థములు కావ్యమునందంతటను వ్యాపించునని యర్థము. ఈ వ్యాపకశబ్దసముదాయ నిక్షేపగ్రంథాంతమునందు అని యర్థము. అనగా శకుంతల క్షత్రపరిగ్రహయోగ్య యని దుష్యంతునకు దెలిసిన తరువాత. రథ్యాః - గుఱ్ఱములు. రథ్యము లనగా రథమునకు కట్టబడునవి. రముక్రీడాయాం. ఆరథ్యము లిచ్చట కర్త. అవి పగ్గములు సడలిన తరువాత నిరాయత పూర్వకాయ ములై- ఇందొక లేది పశ్చార్ధేన ప్రవిష్ట శ్శరపతన భియా భూయసా పూర్వకాయం- దాని కిది వ్యతిరేక మైనమాట. నితరాం దీర్ఘస్య పూర్వభాగాః ఏషాంతే. తత్పంశయ నివృత్తివరకు నన్నియు నిక్కబ్డై. ప్రతి దియు సందేహమే. తరువాతి కథయంతయు తీసికొని వచ్చి తొలుతటి కథలో చొప్పించవలసి వచ్చినది. ఇంక ముందటికథ దానియంతట నది యథేచ్ఛముగా సాగును. ముందటి కథలో వెనుకటి కథయొక్క చొప్పింపు లేదు. అందుచే యథేచ్ఛముగాఁ బోవును. మరియు నంతియేగాదు. ఆపూర్వకథను విస్తరించును. అనగా నాటకముయొక్క స్వరూప మేమనగా పర భాగము పూర్వభాగమునందుఁ జొచ్చి యుండుటయు. ఆ పూర్వభాగము యొక్క విస్తృతియే పరభాగ మగుటయు. ఈ రథ్యములు మరియు నిభృతోర్ధ్వ కర్ణములు. కర్ణ మనగా శబ్దగ్రహణము చేయునది. లేదా శబ్దము దానియందుండును. అది ఆకాశ స్థానీ యము గనుక. మరియు తమచేత లేపబడిన రజముల చేతఁగూడ నలంఘనీయములు. రజశ్శబ్దమున్నది. రంజయతీతి రజః. రంజ రాగే-దీనిచేత మనుష్యు లనురక్తులగుదురు. ఈ రథ్యములు—రథము రమ్ ధాతువునుండి పుట్టినదిగదా. అవి క్రీడావాహకములు— ప్రసక్తమై శృంగార రససంబంధి భావపరంపరయగు చున్నది. తమచేత లేపబడిన రజస్సులచే గూడ నవి యవిలంఘనీయము లగుచున్నవి. రజశ్శబ్దము అను రాగ లక్షణముగలది. అది దుఃఖహేతువు. రథ్యములు రసభావస్థానీయములైనచోనవి అనురక్తదుఃఖాదులను దాటి పోవుచున్నవని యర్థము. ఈ కథలో ప్రేమ యున్నది. ఈ కథలో దుఃఖమున్నది. వాని నతిక్ర మించి రససాంతత్యము సాగుచున్నదని యర్థము. అనగా కథాభంగ మైనట్లు కల్పించినను రస భంగ మెచ్చటను గాలేదని తాత్పర్యము. ఆరథ్య ములు మృగజవము నోర్వ వన్నట్లు పరుగెత్తు చున్నవి. ఇచ్చట రథ్యములు కావ్యగత రసస్థానీయము లని చెప్పబడినవిగదా. మృగము శకుంతలాస్థానీ యము. అనగా కావ్యగతరసము శకుంతలా పరిత్యా గాదిజనిత రసభంగ భ్రాంత్యాది సర్వవిషయాతీతమై రసము ప్రవర్తిల్లు చున్నదని యర్థము.

లేదా కాళిదాసుయొక్క ప్రయత్నము. ఈ యుత్తర కథను పూర్వకథలో చొప్పించు ప్రయత్నము చేసి నంత మేర పరమకవితాభావనాపటిమయందు నియచ్ఛి తమై యుండి తరువాత పలుమార్గముల పరమ రమ ణీయమైన భావనాలక్షణముతో ప్రవర్తించినదనియు వ్యంగ్యము. ఈ యర్థమునే 'దర్భై రర్ధావలీఢై శ్శ్రమవివృత ముఖభ్రంశిభిః కీర్ణవర్త్మా' అని కాళి దాసు సూచించినాడు. ఇన్ని యర్థము లిమిడించి

వ్రాయుటక్రమ. నడుమనడుమ నట్టి భాగములు వదలి పెట్టి యూరక యా వర్ణనజుచేయుచు పోవుచుండును. అట్టి భాగములు - అనగా ఈదృక్కా వ్యార్థగర్భిత వాక్యములు తత్రతత్ర కావ్యమునందు గోచరించునవి యర్థము. నీవారా శ్శుకగర్భ కోటరముఖ భ్రష్టా స్తరూణా మధః - మరియు కుల్యాంభోభిః పవన చపలై శ్శాఖినో ధౌతమూలాః - ద్వితీయాంకము లో గాహన్తాం మహిషా నిపాన సలిలం శృంగై ర్ముహుస్తాడితం - మరియు మేదశ్ఛేదకృశోదరం లఘుభవ త్యుత్థానయోగ్యం వపుః - ఇట్టి వన్నియు నీ కావ్యమను లేడి పరువెత్తుచుండగా శ్రమవివృతి ముఖభ్రంశులైన అర్ధావలీఢములైన దర్భలు. అర్ధావ లీఢమన్న శబ్దములోని అర్ధశబ్దము వాని యౌచిత్య ద్యోతనార్థము. అవి యింత బిగింపులోనికి రావు. కాని శిల్పములోని భాగములే.

ఇట్లు వ్యుత్పత్త్యర్థములు చెప్పి లేనిపోని యర్థ ములు కల్పించుచున్నా వనవచ్చును. ఆ పద్యము నుండి ఈ స్ఫూర్తి నిస్సందేహముగా వచ్చుచుండగా ఆ స్ఫూర్తి వట్టి స్ఫూర్తిగాదు. సమూలకమైనదని హేతు వులు చూపించుట గాని ప్రధానమైన స్ఫూర్తిని నిర్మిం చుట గాదు. ఈ స్ఫూర్తి యనివార్యము. ఎందు కనగా రాజు వెంటనే ఇట్లనుచున్నాడు. "సత్యం, అతీత్య హరితో హరీంశ్చ వర్తంతే వాజినః."

యదాలోకే సూక్ష్మం వ్రజతి సహసా తద్విపులతాం
యదర్ధే విచ్ఛిన్నం భవతి కృతసంధాన మివ తత్
ప్రకృత్యా యద్వక్రం తదపి సమరేఖం నయనయోః
న మే దూరే కించిత్ క్షణమపి న పార్శ్వే రథజవాత్.

ఏది తొలుత చూచుటకు సూక్ష్మముగా కనుపించి నదో అది విపులత్వమును పొందినది. అంగుళీయక ప్రదాన మున్నది. దానిమీద నెన్ని యక్షరములు గలవో అన్ని దినములు కడపకమునుపే నీకు గబు రంపింతునని రాజన్నాడు. ఇది చాల సూక్ష్మ విష యము. ఇది యెంత విపులత్వమును భజించినది!

'యదర్ధే విచ్ఛిన్నం భవతి కృతసంధాన మివతత్- ఏది సగములో విచ్ఛిన్నమైనదో అది యతుకబడిన ట్లున్నదా యన్నట్లున్నది. శకుంతలా దుష్యంతుల వివాహము విచ్ఛిన్నమైనట్లు గన్పించుచున్నది. అది విచ్ఛిత్తి కాలేదు. కలిసియే యున్నది. దీని కలయిక రసవిషయ పర్యాలోచన చేయునప్పుడును, దుష్యం తుని సత్పురుష లక్షణమును విచారించునపుడును విస్తరించి వ్రాయబడును.

ప్రకృత్యా యద్వక్రం తదపి సమరేఖం నయ నయోః-ఏది ప్రకృతిచేత వక్రమో అది నయనము లకు సమరేఖ గలది. దుష్యంతుడు శకుంతలను నేను మరచిపోయితి ననుటకంటె వక్రమేమున్నది? సంస్కృత భారతములోని శకుంతల కొడుకు కైదా రేండ్లు పెరిగిన తరువాత దుష్యంతుని యొద్దకుఁ బోయినది. ఆయనయే మరచిపోలేదు. నెలలు నిండక ముందు వెళ్ళిన శకుంతల నీ దుష్యంతు డెట్లు మరచి పోయెను? ఇది ప్రకృతిలో నసహజము. ప్రకృతిచేత నింతకంటె వక్రమైనది యుండదు. అది నయనము లకు సమరేఖముగా నున్నది. నీఞ్ ప్రాపణే-నీయతే అనేన ఇతి నయనం. కన్నులు రెండు. ఈ దుష్యం తుని వక్రత రెండు విషయములచేత సమరేఖను దాల్చినది. ఈ రెండు విషయము లేవి? ఒకటి శాపము. రెండు దుష్యంతుని యంతఃకరణ ప్రవృత్తి. ఈ యర్థములు గూడ తత్సందర్భమున విస్తరించి చెప్పబడును.

న మే దూరే కించిత్ క్షణమపి న పార్శ్వే రథజవాత్. మరల రథశబ్దమును వాడినాడు. ఈ దూరపు దగ్గరల తనము సర్వకథా సంబంధియైనది. అది క్రమముగా తెలియబడెను. సూత! పశ్యైనం వ్యాపాద్యమానమ్. "సూతుడా! ఇదిగో చూడు చంపబడుచున్నదానివి." సూతపశ్యైనం వ్యాపాదితం అనలేదు. వర్తమాన సామీప్యే వర్తమానవద్వా ఇతరకవులు వాడవచ్చును. కాళిదాసు తూచి వాడునుగదా. చంపబడబోవుచున్నది. అనగా శకుంతల పరిత్యజింపబడబోవుచున్నది. పరిత్యజింపబడలేదు. నేనామెను పరిత్యజించితినని రాజనలేదు. పురోహితుడు పంచమాంకములో ఇట్ల న్నాడు. "అత్రభవతీ తావదాప్రసవా న్మమ గేహే

తిష్ఠతు. కుత ఇద ముచ్యత ఇతి చేత్, త్వం సాధుభి రాదిష్టపూర్వ ఏవ ప్రథమం చక్రవర్తినం జనయిష్య సీతి. సచే న్మునిదౌహిత్రః తల్లక్షణోపపన్నో భవిష్యతి అభినన్ద్య, శుద్ధాన్త మేనాం ప్రవేశయిష్యసి. విపర్యయే పితు రస్యా స్సమీపగమనం ఉపస్థిత మేవ" నీకు చక్రవర్తియైన కొడుకు పుట్టునని సాధువులు చెప్పిరిగదా. ఈమె కడుపున బుట్టినవాడు తల్లక్షణోపపన్నుడైనచో నీమెను భార్యగా స్వీకరించవచ్చును. లేదేని తండ్రియింటికి బోవుట యుండనే యున్నది. అంతవరకు నాయింట నుంచుకొందును అన్నాడు. రాజేమనవలయును? ఆమెకు మనకు సంబంధమేమి? నీ యింట నుండుటయేమి? ఆ కొడుకు చక్రవర్తిలక్షణోపపన్నుడైనంత మాత్రమున నా కొడుకని నిర్ధారణ యేమున్నది? అని మృగస్థానీయురాలైన శకుంతలను వ్యాపాదింపవచ్చు. శకుంతలా స్థానీయమైన మృగమును వ్యాపాదించవచ్చును. ఆ మృగము వ్యాపాదితముకాలేదు శకుంతలపరిత్యక్త కాలేదు. రాజేమన్నాడు. "యథా గురుభ్యో రోచతే." గురువుల యిష్టము అన్నాడు. అనగా అట్టిది జరిగినచో స్వీకరించుదునన్న మాటయేగదా. అందుకనియే రాజు 'పశ్యైనం వ్యాపాద్యమానం' అని శానచ్చేవాడి నాడు. క్రాంతము వాదలేదు. ఈ విచారణ లేనిచో, క్రాంతము వాడినను భాషాలక్షణ విరుద్ధముగాదు.

ఈ లేడిని చంపకపోవుటలోనే కథయంతయు నిక్షిప్తమైయున్నది. ఇతిశరసంధానం నాటయతి అని బాణసంధానము నటించుచున్నాడు. ఇది రూపకము గనుక ఇట్లు వ్రాయుట న్యాయమే. కావ్యము గనుక ధ్వనిపుట్టుట న్యాయమే. అనగా శరసంధానమే చేయబడలేదు. దుష్యంతు డామెను పరిత్యజించనే లేదు. ఇది యేమిమాట యనవచ్చును. దుష్యంతు లిద్దరని చెప్పితినిగదా మనోనిష్ఠుడై ప్రకృతినిష్ఠుడైన దుష్యంతు డొకడు అంతఃకరణనిష్ఠుడై పినాకిభూతుడైన దుష్యంతు డొకడు, రస విషయమున నిద్దరు నొక్కటియే. కథా భంగభ్రాంతి హేతువున నిద్దరు నిద్దరు. ఇది పెద్దవిషయము.

వెంటనే ఋషులు వచ్చినారు. బాణ ముపసంహరింపుమన్నారు. రాజుపసంహరించెను. ఎక్కుపెట్టిన బాణ ముపసంహరించుట క్షత్రలక్షణముగాదు- ఇది యాశ్చర్యమైన దుష్యంతుని వినయసంపత్తిని చెప్పుచున్నది. అందుకని ఋషులాశీర్వదించిరి.'జన్మయస్య పురోర్వంశే యుక్తరూప మిదం తవ. పుత్రమేతం గుణోపేతం చక్రవర్తిన మాప్నుహి.'

ఇక్కడితో నుత్తరకథ యంతయు పూర్వకథలో చొప్పించుట యైపోయినది. ఈ కథా పరమార్థము దుష్యంతునకు భరతుడు సముత్పన్ను డగుట. ఆయన శకుంతలను ప్రేమించిన దిందుకే. ఆమె గర్భముననే భరతు డుదయించవలయును. ఇది వేర విషయము. ప్రస్తుతము మృగవ్యాపాదనమును నిషేధించుచు ఋషులు వచ్చుట, చక్రవర్తియైన కొడుకును కనుమని దీవించుట యీ సన్నివేశము. దుర్వాసుని శాపము, అది రాజునకు తెలియుట, అతని సంశయము నివారింపబడుట, మరీచాశ్రమములో పుత్రదర్శన మగుట, ఈ మహార్థమున కంతకు నీ చిన్ని సన్నివేశము స్ఫోరకము, వ్యంజకము. ఇదియొక విచిత్రమైన రచన.

లేడిని చంపవద్దని వచ్చినవారు మువ్వురు. తతః ప్రవిశత్యాత్మనా తృతీయః వైఖానసః. వైఖానసుడును మరి యిద్దరును వచ్చిరన్నమాట. మాటాడినది వైఖానసు డొక్కడే. తక్కిన యిద్దరును మాటాడనేలేదు. వైఖానసుడు మరీచస్థానీయుడు. తక్కిన యిద్దరు కణ్వుడును, దుర్వాసుడును కావచ్చును. కాదా శార్ఙ్గరవ శారద్వతులు కావచ్చును. ధ్వని యవివక్షితమైన విషయము. ప్రతిపత్త్ర ప్రతిభాభానమానము.

ఇందు వ్రాయబడిన ధ్వనులు ధ్వనులే. నా వివక్ష యొకడైనచో మరి యింకొక రసజ్ఞుని వివక్ష మరి యొకడు కావచ్చును. కాని "పశ్చార్ధేనప్రవిష్ట శ్శరపతనభియాభూయసా పూర్వకాయం" అన్న వాక్యము దీనికంతకు స్ఫోరకమనియు, ఉత్తర కథయంతయు సారంగ దర్శనాది ఋష్యాశీరంతము ఈ రీతిగా నిమిడింపబడి యున్నదనియు, నన్నవిషయము ధ్వనివేత్తలు మన్నింతురని యాశ.

నాగభూషణ్ | # పెళ్ళికోసం

ఇందులో పాత్రలు : లత - కామరాజు

[ సాయంకాలం అయిదు గంటల వేళ—పాఠశాలా భవనంలో ఉపాధ్యాయుల గది—

గది గోడలమీద 'సత్యం వద, ధర్మంచర', వంటి కొన్ని సూక్తులూ, గాంధీగారూ కస్తూరిబాతో కలిసివున్న ఫొటో, రెండు చిలకల్ని గుడ్డమీద కుట్టి కట్టించిన ఫ్రేము—వున్నాయి.

నాలుగయిదు కుర్చీలు, మధ్య ఒక టేబులు; గోడలకు ఆనుకొని అయిదారు బెంచీలు మధ్యలో రెండు బెంచీలు అమర్చివున్నాయి.

గదికి రెండు ప్రక్కల కిటికీలు. ఒకకిటికీ మూసి వుంది. కుడిచేతివైపుగా వాకిటిలోనుంచి రాకపోకలకు ద్వారం వున్నది.

పడమరకు తిరిగిన సూర్యుని కిరణాలు కిటికీ గుండా తెల్లని గోడమీద పడి క్లైలు కటకటాలను జ్ఞప్తికి తెస్తున్నాయి.

తెర లేచేసరికి లత కుర్చీలో కూర్చుని పుస్తకాల నన్నింటినీ సర్దుతోంది. ఆమె ముందు టేబులుమీద ఓ యాభై కాంపోజిషన్ పుస్తకాలూ, ఒక ప్రక్క సిరాబుడ్డీ, పాళీ విరిగిపోయిన ఓ కలం—కొన్ని గుండుసూదులూ వున్నాయి. ఆమె ముఖం అందమయినదే! అయినా అలసట ప్రస్ఫుటంగా కానవస్తున్నది. గాలికి ముఖంమీద పడిన ఆమె ముంగురులు ఒడ్డునపడిన చేపల్లా కొట్టుకుంటున్నాయి. ఆమె వయసు పదహారు నుంచి ముప్పయి దాకా ఎంతయినా వుండ వచ్చు. మనిషి చామనచాయ. సన్నగా వుంది. ముఖాన పెద్ద కుంకుమ బొట్టు—అర్థ్రంగా కవిపించే కళ్ళు.

గది వాకిలిదగ్గర ఓ మనిషి కొంచెంసేపటినుంచి నిలబడి వున్నాడు. ఆమె దృష్టి అటు తిరగలేదు. తన రాకను తెలియ చేస్తూ ఆ మనిషి దగ్గుతాడు. ఆమె అతనివంక చూచి లేచింది. అతడు లోపలకు వస్తూ.—]

కామరాజు : నా పేరు కామరాజు.

లత : (చిరునవ్వు తెప్పించుకొని) నాకు తెలుసు. లోపలకు రండి.

కామ : రక్షించారు....కనీసం నా పేరయినా తెలిసింది మీకు.

లత : కనీసం అంటే?

కామ : అంటే, మిగిలిన వివరాలు - నే నెందుకు వచ్చిందీ వగైరా లన్నీ మీకు తెలియవు కదా అని—

లత : కూర్చోండి....మా స్కూలులో సోఫాలు లేవు. ఆ కుర్చీమీద కూర్చోండి—

కామ : భాగ్యవంతు లందరూ ఎప్పుడూ పట్టుపరుపులమీద తప్ప కూర్చోరని మీ భావం కాబోలు!

లత : అబ్బే! ఇక్కడ లేవన్నాను. అంతే! కూర్చోండి (అని కుర్చీని అతనికి దగ్గరగా జరుపుతుంది.)

కామ : (నవ్వి) నన్ను క్రింద కూర్చోమన్నా కూర్చుంటాను గాని ఆ కుర్చీమీద మాత్రం కూర్చోమనకండి... అది పంతులుగారి కుర్చీ—టీచరుగా వుండడానికి నేను ఏ మాత్రం తగను. ఇక పంతులుగారి దగ్గరకు వచ్చాను కనుక నేనూ ఒక విద్యార్థిగానే అనుకొని ఇలా బెంచీ మీద కూర్చుంటాను. (కూర్చుని) మీరూ కూర్చోండి.

లత : (అయన అనవసరంగా చనువు తీసుకుంటున్నందుకు బాధపడి, కుర్చీలో తప్పనిసరిగా కూర్చొని) ఆఁ! ఈ వేళప్పుడు మా స్కూలుకు ఏపనిమీద వచ్చారో చెప్పండి.

కామ : పని స్కూలుతో కాదు. మీతో—

లత : (లజ్జతోను, భయంతోను ఆమె ముఖం వివర్ణమైంది. కాని తేరుకొని) చెప్పండి.

కామ : అమ్మో! అలా నిజంగా పంతులుగారిలా ఆజ్ఞాపిస్తే నేను అసలు మాట్లాడలేను....(రెండు క్షణాలు నిశ్శబ్దం) మీరు నాకు చాలారోజులుగా తెలుసు—

లత : (ఆశ్చర్యంగా) ఎలా?

కామ : మా యింటిముందుగా రోజూ పుదయం, సాయంకాలం మీరుపోతూ వుండడం నేను చూస్తూనే వుంటాను.

లత : (కఠినంగా) అంటే మీ యింటిముందుగా ఎవరెవరు ఎప్పుడెప్పుడు నడుస్తున్నదీ చూస్తూ వుండడమే మీకు పని అనుకుంటాను.

కామ : మిమ్మల్ని ఖండించను. కాని రోజూ చూస్తున్న వాళ్ళల్లో జ్ఞాపకం వుండేవా రెందరుంటారు?

లత : మీకు జ్ఞాపకం వుండడమే నా గొప్పతనమైతే, ఆ గొప్పతనం, ప్రజ్ఞ నావికావు.

కామ : కావు. నిజమే! ఆ గొప్పతనం నా అదృష్టానిది.
(ఇద్దరూ కొంచెంసేపు మౌనంగా వుంటారు)

కామ : స్త్రీలకు-ముఖ్యంగా మీవంటివాళ్ళకు- మౌనం శోభస్కరం కాదు.

లత : క్షమించండి కామరాజుగారూ! ఆడవాళ్ళనుగురించి, ప్రేమనుగురించి వుపన్యాసాలివ్వడానికి ఇది తగిన సమయమూ కాదు; స్థలమూ కాదు. మీరు వచ్చిన పని ఏమిటో చెప్పండి—

కామ : (కొంచెం బాధపడి) మీరన్నది నిజమే! అయినా వుపన్యాసాలివ్వడం నాకు ఏమాత్రం చేతకాదు. అసలు మాట్లాడడమే— (ఆమె అతనివంక చురుకుగా చూస్తుంది. కామరాజు మధ్యలోనే మాటలను దిగమింగుకుంటాడు.)

కామ : (ఒక్క క్షణం ఆగి) ఇవాళ ఉదయం మీ నాన్నగారిని కలుసుకునే భాగ్యం కలిగింది—

లత : ఆ భాగ్యం మావంటి పేదవాళ్ళది— ఎందుకో?

కామ : (లేచి కిటికీదగ్గరకువెళ్ళి, వీధిలోకిచూస్తూ) మీకు అభ్యంతరం లేకపోతే—

లత : ఆఁ! లేకపోతే—

కామ : అదే!.... మీకు అభ్యంతరం లేకపోతే నన్ను మీరు వివాహం చేసుకోవలసిందిగా—

లత : (నిర్ఘాంతపోయింది. కోపం వచ్చింది. బాధపడ్డది) ఏమిటీ! మీరు— మీరు—

కామ : ఇంతవరకూ మిమ్మల్ని అడగలేదనేనా? ఇదే నా ప్రార్థనగా స్వీకరించండి.

లత : ఎంత ధైర్యం?

కామ : ధైర్యమా! నాకా! ఆమాట మీ నోటివెంటనే మొట్టమొదటిసారి వింటున్నాను.

లత : (భరించలేక, లేచి) చాలించండి, కామరాజుగారూ! మీరు ఎంత ధనవంతులైనా, గొప్పవారైనా కావచ్చు. కాని... కాని నన్ను ఇలా అవమానిస్తారా?

కామ : అవమానమా!.... నాకేం అర్థం కావడంలేదు.... పెద్దగా చదువుకున్నవాడిని, నలుగురిలోకి రావడానికి అలవాటుపడ్డవాడిని, కాదు....ఏమైనా పొరపాటు జరిగితే-

లత : నిజమే!.... మీకేమాత్రం ప్రపంచజ్ఞానం వున్నా యీ సమయంలో యిక్కడకు వచ్చి నాతో పెళ్ళి విషయాలు ముచ్చటిస్తారా?

(కామరాజు బెరుకుగా చుట్టూవున్న గోడలను, పరికరాలను పరిశీలిస్తాడు.)

కామ : ఇక్కడకు రాకూడదన్న ఆలోచన నాకు కలగని మాట నిజమే! ఈ వేళప్పుడు మీరు యిక్కడ ఒంటరిగా స్కూలు అయిపోయాక ఒక గంటసేపు వుంటారని మాత్రం తెలుసుకున్నాను. మీ నాన్నగారితో మిమ్మల్ని యివ్వాళనే కలుసుగుంటానని చెప్పాను....వారు మీరాక కోసం ఎదురుచూస్తూ వుండవచ్చు.

లత : ఎందుకు?

కామ : ఈ విషయం వారిదగ్గర యీ వుదయం ప్రస్తావించినప్పుడు దీనిలో ఏ నిర్ణయమైనా మీదేనని చెప్పారు ఆయన—

లత : అందువల్ల యీ వేళకానివేళ యిక్కడకు వచ్చారన్న మాట!

కామ : పొరపాటే! కాని నా తొందర అలా అనిపించింది. మీరు యీ వేళప్పుడు యిక్కడ ఒంటరిగా (చివరి మాటకు లత వురుముతూ చూస్తుంది అతనివేపు) అదే.... మాట్లాడడానికి....

లత : అయితే ఆ మాట్లాడేదేదో త్వరగా కానివ్వండి.

కామ : నన్ను వివాహం చేసుకోమని మిమ్మల్ని అడిగే ముందు నా విషయం మీకు వివరంగా చెప్పాలని నా వుద్దేశ్యం—

లత : (వ్యంగ్యంగా) చాలా గొప్ప వుద్దేశ్యమే. చెప్పండి.

కామ : (ఒకసారి ఆమెవంకకు దీనంగా చూసి) మీ విషయం • కొంచెమో, గొప్పో నేను తెలుసుకున్నాననుకోండి—

లత : (కోపంతో) అలాగా! ఏమనో—

కామ : పెద్దగా ఏమీలేదు....మీ వయసు ఇరవై ఐదనీ, మీకు వచ్చిన సంబంధాలన్నీ కట్నంలో వచ్చిన భేదాభిప్రాయాలవల్లనే తప్పిపోయాయనీ— (ఆమె వంక బెరుకుగా చూస్తాడు)

లత : నన్ను గురించి ఎవరో మీకు ఖచ్చితమైన సమాచారం యిచ్చారు.

కామ : నన్నుగురించి మీకు ఎవ్వరూ నేను చెప్పినంత ఖచ్చితమైన సమాచారం యివ్వలేరు. నా జీవితగాథ కూడా మీరు వినాలి.

లత : (తిరిగి వ్యంగ్యంగా) మీజీవితగాథా! ఎంత గొప్పదో! చెప్పండి-

కామ : మీకు చివరకు ఎలా కనిపించినాసరే! నేను మాత్రం చెప్పక తప్పదు ... (లేచి, కిటికీలోనుంచి బయటకు చూస్తూ) నా ఆరు లక్షల రూపాయల ధనాన్ని, నన్ను

మీకు అర్పించుకోవడానికి ముందు నా చరిత్ర అంతా మీరు తెలుసుకోవాలి.

లత : ఆరు లక్షలా ! జనం అందరూ పది లక్షల పైమాట అనుకుంటున్నారు !

కామ : ఇప్పటికి ఆరు లక్షలే ! అక్కడక్కడ పెట్టిన పెట్టు బడి యింకా రెండు లక్షలు వుంటుంది గాని అది చేతికి వచ్చేదాకా దాని విషయంలో ఆశ వుండకూడదు.

లత : అది మీ వ్యాపార విధానం కాబోలు !

కామ : అవును.

లత : జీవితంలో కూడా మీకు అదే సూత్రమా ?

కామ : అంటే—?

లత : చేతికి అందేదాకా ఏ సుఖాన్ని నమ్మి కూర్చోకూడ దని—

కామ : ఒక విధంగా నిజమే ! మీ రెలా కనుక్కో గలి గారు ?

లత : (నవ్వి) నాకు కర్ణపిశాచి వుంది....ఆఁ ! మీ సంగతి చెప్పండి.

కామ : నేను ఆ సూత్రాన్నే నమ్మాను. ఇంతవరకు నేను సంపాదించిన ప్రతి చిల్లిగవ్వ నా స్వార్జితమే ! ఇవ్వాళ అంటే నా కాళ్ల మీద నేను నిలబడగలిగాను కాని—ప్రతి నిమిషం ఆశారహితంగా, బాధా భరితంగానూ నేను గడిపిన నా ఇరవై ఐదేళ్ల జీవితం నా కళ్ల ముందు ప్రతి నిత్యమూ కదులుతూనే వుంటుంది. జీవితంలో ఒకే ఒక్క సారి—కొద్ది క్షణాలు మాత్రం—నేను సుఖపడే సూచ నలు కనిపించాయి....కాని చేతిలో వున్న పండును— నెత్తినకొట్టి పక్షి ఒకటి తన్నుకుపోయింది....పాతిక సంవత్సరాలు నేను బీదవాడిని, ఒంటరిగాడిని—ఐదు సంవత్సరాలుగా నేను భాగ్యవంతుడిని, అయినా ఒంటరి గాడినే—

నేను సంపాదించిన ప్రతి పైసా న్యాయంగా సంపా దించినదే ! అయినా బీదతనం నా మీద అచ్చుగుద్దిన ముద్రలు శాశ్వతంగా నాలో ఏలిచిపోయాయి....ఇవ్వాళ కామరాజును గురించి ఒక్కడు మంచిగా మాట్లాడడు.... మంచిదే ! నేను నాగరికత ఎరుగని మూర్ఖుడిప. నా అభిరుచులు, అభిమానాలు చాల తక్కువ స్థాయిలో వుంటాయి. కవిత్వం అంటే నాకు అసహ్యం. సంగీత మంటే తలనొప్పి—

లత : మీలో వున్న లోపా లేమిటో మీరు చెప్ప నక్కర లేదు....మీతో మాట్లాడిన యీ కొంచెం సేపటిలోను నాకు బాగానే అర్థం అయారు మీరు.

కామ : (ఏమీచలించక) బావుంది....అయితే నా జీవితంలో ముఖ్యమైన కొన్ని సంఘటనలు మీకు చెప్పాలి....

లత : (త్వరగా) అక్కర్లేదు.

కామ : (ఆమాట వినిపించుకోకుండానే) దక్షిణాదిన - మైకా గను లున్న ఒకవూళ్లో - నేను ఓ అమ్మాయిని కలుసు కున్నాను. సాధారణంగా చెడిపోయిన ఆడవాళ్ళంటారే, ఆమె ఆ కోవకుచెందినది. నా సర్వస్వం అనుకున్న ఆ మనిషి మరొకడితో లేచి పోయింది. నీలగిరి కొండల దాకా వెంటాడి ఆవిడతో వున్న అతనిని చంపాను. ఆమెను నాతో రమ్మని బ్రతిమాలాను. ఆమె నిరాక రించింది....అది ఒక్కటే నా జీవితంలో యింత వరకు జరిగిన ప్రేమ వ్యవహారం... ఆమె నాకు కావా లనుకున్నంత గాఢంగా మరెవ్వరిని గురించీ అనుకోలేక పోతున్నాను. (ఒక దీర్ఘ నిశ్వాసం విడిచి) ఈ విషయం యింతవరకు ఎవ్వరికీ చెప్పలేదు. అంతా వివరంగా చెప్పాను గదా ! ఇప్పుడు నన్ను పెళ్ళిచేసుకోమని మిమ్మల్ని అడిగితే—

లత : అడిగితే అటు సూర్యుడు యిటు పొడిచినా చేసుకోనని చెబుతాను.

కామ : (చాలాతేలికగా) పోనీలెండి. ఆమాట అయినా నిష్కాపట్యంగా మొహాన చెప్పేశారు.

లత : చూడండి....మీరు నేనంటే విశ్వాసం చూపారుకనుక- మీ విశ్వాసానికి ప్రతి విశ్వాసం నేనూ చూపుతాను. ఏదేళ్ళనుంచీ నాన్నగారు నా పెళ్ళి విషయం ప్రయత్ని స్తూనే వున్నారు. డబ్బులేఁవాళ్ళ పిల్లలకు పెళ్ళిళ్ళు చెయ్యడం ఎంత కష్టంగా వుందో మీకు తెలియదు.... చేసిన ప్రతి ప్రయత్నం విఫలమైంది... ఇష్టాయిష్టాలతో ఏమాత్రం సంబంధం లేకుండా— డబ్బున్నవాడికి పిల్ల నివ్వడం ఒక్కటే పరమావధిగావున్న యీ రోజుల్లో మీ ప్రార్థనకు నాన్నగారి అంగీకారమైతే లభించింది. కాని మీరంటే నాకుమాత్రం ఏకోశానా సద్భావం అంటూ లేదు.

కామ : అందుకని మిమ్మల్ని తప్పుపట్టడం లేదే !

లత : తప్పుపడతారని కాదు. మీరు నన్ను యింటిదగ్గర కలుసుకొనివుంటే యీ విషయాలు చెప్పేదాన్ని కాదు. కాని ఇక్కడ—(సత్యం వద అని వ్రాసివున్న గోడవైపు చూస్తూ) ఇక్కడ మీకు నిజమే చెప్పా లనిపిస్తున్నది. నేను పొరపాటున మిమ్మల్ని పెళ్లి చేసుకుంటే అది మీ డబ్బుకోసమే గాని మరెందుకూ కాదు....ఆ విషయం తెలిశాక కూడా మీకు నన్ను పెళ్ళి చేసుకోవాలని వుందా?

కామ : ఉండకూడదా ?

లత : (ఆమెకు కోపం, అసహ్యం కలుగుతున్నాయి) మీరు చెప్పిన ప్రేమ వ్యవహారంవంటిది కాకపోయినా—నేనూ నా మేనత్త కొడుకును చిన్నప్పటినుంచీ పెళ్లి చే—సుకోవాలనే అనుకు—న్నాను. కాని వాళ్ళు చాలా బీద వాళ్ళు....నా జీవితంలో నేను ఎవరినైనా ప్రేమించగలిగితే అతన్ని ఒక్కడినే ! మా తల్లిదండ్రులకు తెలియకుండా వున్నట్లయితే అతనితో వెళ్ళిపోయేదాన్నే !....ఇంతవరకు నేను పేదరికంలో గడిపాను.... దాన్ని ప్రేమించడం నేర్చుకున్నాను....అందువల్ల డబ్బు వున్నదన్న అహం కలవాళ్ళను చూస్తే అసహ్యం... అసభ్యంగా ప్రవర్తించే వాళ్ళను నేను ఏ మాత్రం సహించలేను....నాకు తెలిసినంతలో మీ అంత అసభ్యంగా మరెవరూ ప్రవర్తించలేదు....ఇంకా నన్ను పెళ్ళి చేసుకుంటారా ?

కామ : (లోపల వున్న సంతోషాన్ని దాచుకొని) తప్పకుండా!

లత : (రెచ్చిపోయి) ఏమిటి మీ వుద్దేశ్యం? నే నేమైనా ఆట బొమ్మ ననుకున్నారా ? మీ లక్షల కోసం నన్ను నేను అమ్ముకుంటా ననుకున్నారా ? (కొంచెంసేపు నిశ్శబ్దం)

కామ : లతాదేవీ ! తర్కం మీ అభిమాన శాస్త్రం కాదని తెలుస్తోంది....నన్ను గురించి నేను యింత స్పష్టంగా మీకు చెప్పివుండకపోతే మీరు నన్ను నిరాకరించేవారే కారు. అవునా ?

లత : నేనా !....నేను—

కామ : నేను ఎంతో మంచివాడినిగా మీదగ్గర నటించివుంటే మీరు ఎగిరి గంతువేసి యీ పెళ్ళికి ఒప్పుకుందేవారు. అవునా ?.... సరే ! అసలు విషయానికి వద్దాం.... మరి మన వివాహానికి ముహూర్తం పెట్టించమని మీ నాన్నగారితో చెప్పమంటారా ?

లత : (కఠినంగా) కామరాజుగారూ ! నిష్కర్షగా నిజాన్ని చెప్పడానికికూడా కొన్ని హద్దులు వున్నాయి.... ఆ హద్దులు దాటితే, దానిని మూర్ఖత్వం అంటారు. ఇక వదండి. ఇప్పటికే ఆలస్యం అయింది. (అని లేస్తుంది)

కామ : మీకు అయిదుగురు చెల్లెళ్ళు వున్నారని విన్నాను.... అందరికీ పెళ్ళిళ్ళు కావాలికదూ ? (లత నిలిచింది. ఆమె తల వాల్చివేసుకుంది భారంగా.) మీ నాన్నగారు—

లత : (గట్టిగా) చాలు.... మా నాన్నగారినిగురించి ఒక్క మాట అనకండి—

కామ : నేను చూసినంతలో మీ నాన్నగారివంటి ఉత్తముడు నాకు ఎక్కడా కనిపించలేదు.... కాని అయన పేదవాడు. ఇందరికి వివాహం ఎలాచేయగలరో ఆలోచిం చారా ?

లత : అయితే మా మీద జాలివల్ల మీరు నన్ను పెళ్ళి చేసుకోదలిచారన్నమాట !

కామ : అంతమాట అనను... నేను జీవితంలో ఒంటరిగాడిని. ఇంత భారాన్ని ఒక్కడినే మోయలేకపోతున్నాను. అందుకోసం ఎవరినో ఒకరిని పెళ్ళి చేసుకోదలుచుకున్నాను.... ఆ ఎవరో ఒకరిపాటి చెయ్యరా మీరు ?.... (లత నవ్వుతుంది) ఏం ? ఆశ్చర్యంగా వుందా ?

లత : మీకు ఏమాత్రం ఆలోచనవున్నా యీ విషయం యింత ధీమాగా స్త్రీల ఎదట ఎలా చెప్పగలుగుతున్నారా అని ఆలోచిస్తున్నాను.

కామ : అంటే— ఒకరినొకరు ప్రేమించుకుంటేనేగాని పెళ్ళిళ్ళు జరగకూడదని మీ మతమా ?

లత : నామతం - ప్రేమ వున్నచోట పెళ్ళి జరగదని—

కామ : అంత త్వరగా నిర్ణయాలు చెయ్యకండి.... ఉదాహరణకి మీ బావగారు-అదే, మీ మేనత్తగారి అబ్బాయి-ని మీరు పెళ్ళి చేసుకుందామనుకోలేదా ?

లత : ఎందుకు అనుకోలేదు ?

కామ : మీరతన్ని ప్రేమించారుగదా ?

లత : అయితే—

కామ : మీ తల్లిదండ్రులు అడ్డగించకుండావుంటే అతనితో వెళ్ళిపోయేవారుగదా—

లత : అవును....

కామ : అంటే వెనక మీరు పెళ్ళిని గురించి మరోవిధంగా వూహించారన్నమాట. అతనంటే మీకు చాలా యిష్టమనుకుంటాను.

లత : చెప్పానుగదా !

కామ : ఆయన ఎక్కడ వున్నారు యిప్పుడు ?

లత : పంజాబులో - ఇక యింతటితో ఆ విషయం ఆపడం మంచిది కామరాజుగారూ !

కామ : నువ్వు సుఖపడ లేకపోతే, ప్రక్కవారిని సుఖపెట్టడానికి ప్రయత్నించమని నేను చిన్నతనంలో నేర్చుకున్న నీతి—ఈ రోజుల్లో భాగ్యవంతులు సాధించలేనిదంటూ ఏమీ లేదని మీకు తెలుసు గదా !... మీబావగారి అడ్రసు చెప్పగలరా ?

లత : ఎందుకు ?

కామ : (అతిశాంతంగా) మిమ్మల్ని పెళ్ళిచేసుకోవడానికి వీలయిన పరిస్థితులను ఆయనకు కలిగిస్తాను.

లత : (కలతచెందింది....ఆశ్చర్యపడ్డదికూడా) ఏమిటీ!

కామ : నిజం....మిమ్మల్ని పోషించగలిగిన స్థితికి అతనిని తీసుకు వస్తాను....అతనికి నావ్యాపారంలో భాగమిస్తాను. అతనిపేర కొత్తవ్యాపారం మొదలెడతాను. సంవత్సరానికి అయిదారువేలు వస్తే, మీరిద్దరూ సుఖంగా వుండవచ్చు.

లత : (ఇంకా నమ్మలేక) నిజంగా ?

కామ : నేనంటే ఎక్కువ ద్వేషించేవాడికికూడా—నేను అడిన మాట తప్పనని అందరికీ తెలుసు...మీరూ నమ్మవచ్చు-

లత : నాకు తెలియక అడుగుతున్నాను....మీరు ఎందుకు చెయ్య దలుచుకున్నా రీపని ?

కామ : దానిని వెర్రి అనండి, మూర్ఖత్వం అనండి— ఏమయినా మీరు నా సహాయంవల్ల సంతోషంగా వున్నారంటే నాకు తృప్తి.

లత : (మెల్లగా) అది మీ వుదారత—

కామ : నేను చేద్దామనుకుంటున్న యీ సహాయంవల్ల నా మీద మీకు వెనకవున్న వుద్దేశ్యం ఏమాత్రం మారనక్కరలేదు. నిజానికి మీరు నన్నుగురించి చేసిన ఏ నిర్ణయంలోనూ అబద్ధం ఎంతమాత్రం లేదు.

లత : నిర్ణయాలా ?

కామ : అదే! నేనంటే మీకు ఏమాత్రం సద్భావంలేదని—

లత : అది అంత నిజంకాదు సుమండీ—

కామ : నా అంత అసత్యంగా ఇంతవరకు మీ ఎదుట మరెవ్వరూ ప్రవర్తించలేదనీ—

లత : అబ్బే....అదికాదు—

కామ : నన్ను పెళ్ళిచేసుకోవడం నిరాకరించినందువల్ల మీకు ఎంతో సంతోషంగా వున్నదని—

లత : (త్వరగా) అబద్ధం....నేనామాట అవలేదండి—

కామ : నిజాన్ని నిష్కర్షగా చెప్పడానికి, మూర్ఖత్వానికి మధ్య హద్దులున్నాయని నాకు తెలియదు....అయినా ఆలోచించండి. (కిటికీ దగ్గరకుపోయి) నేను భాగ్యవంతుడినయి ఎన్నాళ్ళయిందంటారు? అయిదు సంవత్సరాలు.... అంతకు పూర్వం—? నేనూ బాధల్లో పుట్టి పెరిగినవాడినే! ఆకలి, నిరాశ, నిస్పృహ—ఒక టేమిటి? లేమిలో, ఆశతో చేతులెత్తి ప్రతి ఒక్కరినీ ప్రార్థించాను. ఒక్కరూ నా మొర ఆలకించలేదు. మానవ జాతి మీదనే విశ్వాసం పోతున్న ఆ రోజులలో అనుకోకుండా నా చేతికి సంపద వచ్చింది. నేను పాదం పెట్టిన ప్రతిచోటా బంగారు వర్షం కురిసింది. నాకు చేతనయినంతవరకు నా మిత్రుల్ని కూడా భాగ్యవంతుల్ని చేశాను. ఇంకా ఎక్కువ యివ్వలేదని నన్ను ఆడిపోసుకుంటున్నారు. నా దగ్గరకు వచ్చిన ప్రతివాడికి డబ్బు విరజిమ్మాను......వాళ్ళకు కావలసినంత యివ్వలేదని తిట్టుకున్నారు. ఇచ్చాక దాటుకుపోయి నన్నుచూసి నవ్వుకున్నారు....(ఒక్క-క్షణంఆగి)

నేను పేదవాడినిగా వున్నప్పుడు నా బాధలను కూడా పంచుకొని ఆదరించడానికి దగ్గర మిత్రులు వుండేవారు— భాగ్యవంతుడిని అయ్యాక—ప్రతివాడికి అయిష్టత...ప్రతివాడి చూపులోనూ ఈర్ష్య, అసూయ, ఆగ్రహం, అసహ్యం చూస్తూ ఒంటరిగా నిలబడివున్నాను....

లత : (దీర్ఘంగా నిట్టూర్చి) ఈ విషయాలన్నీ నాతో ఎందుకు చెబుతున్నారు ?

కామ : (విషాదంగా నవ్వి) ఇహ నన్ను పెళ్ళిచేసుకోమని మిమ్మల్ని అడగడం లేదు కనుక—ఇన్ని సంవత్సరాలుగా నిజాయితీ వున్న మనుష్యులు మీ రొక్కరే కనిపించారు కనుక—మీకు కలగబోతున్న సంతోషంలో నన్ను గురించి ఒక్క మంచిమాట అనుకుంటారని ఆశ వున్నది కనుక—(లేచి) క్షమించండి...అనవసరంగా మిమ్మల్ని చాల సేపు విసిగించాను—

లత : అయితే, ఎంతో ఆశపడుతున్న మా నాన్నగారికి ఏమి సమాధానం చెప్పమంటారు ?

కామ : ఉన్న విషయం చెప్పండి. మీరు నన్ను పెళ్ళి చేసుకోవడానికి నిరాకరించారని-

లత : నాన్నగారికి ఎంత కోపం, ఎంత ఆశ్చర్యం కలుగుతాయో ? సరే!.... మీ సహాయ ప్రణాళికను ఎలా అమలు పెడతారు ?

కామ : ఏముంది ? నాలుగైదు రోజుల్లో బయలుదేరి మీ బావగారు వున్నచోటికి వెడతాను. ఆయనకు నన్ను పరిచయంచేస్తూ రెండు ముక్కలు మీరు వ్రాసి యివ్వండి.... విషయాన్ని సవిస్తరంగా ఆయనకు చెప్పడమే శ్రేయస్కరమని తోస్తున్నది.

లత : దానిని గురించి ఇంకా ఆలోచించాలి.

కామ : స్థిమితంగానే ఆలోచించండి........ (కొంచెం ఆగి) దీనికి ప్రత్యుపకారంగా మీరుకూడా నాకొక చిన్న సహాయం చెయ్యాలి.

లత : నేనా ? ఏమిటది ?

కామ : నాకో భార్యను నిర్ణయించాలి.

లత : (ఆశ్చర్యంగా) భార్యను నేను నిర్ణయించాలా ! కాని-

కామ : నాకేమీ ప్రత్యేకమైన కోరికలు లేవు. మీరు హృదయపూర్వకంగా ఏ స్త్రీని పెళ్ళిచేసుకోమంటే ఆ స్త్రీని కళ్ళుమూసుకొని చేసుకుంటాను.

లత : అయితే.... మీరు నాతో చెప్పిన విషయాలన్నీ ఆమెకూ చెప్పాలా ?

కామ : అక్కర్లేదు.... మిమ్మల్ని చూస్తే నాకు చెప్పబుద్ధి వేసింది. అంతే !

లత : ఆమెకుప్రత్యేకంగా ఏలక్షణాలూ వుండనక్కరలేదా ?

కామ : స్త్రీలు ఎలావుంటే నచ్చుతారో నాకు తెలియదు. నన్ను కొంచెంగా అర్థంచేసుకోగలిగి, నా డబ్బును ఉదారంగా ఖర్చు చెయ్యగలిగిన మనిషయితే చాలు—

లత : కాని వివాహం అంటే యింత అవసరం, యింత నిర్లక్ష్యం ఏమిటి మీకు ?

కామ : ఏమిటో : రానురాను నామీద నాకే విశ్వాసం తగ్గుతున్నది. ఇప్పుడు ఎవరో ఒకరు నాకు బాసటగా నిలవక పోతే పడిపోతాననిపిస్తున్నది.

లత : అందుకోసమన్నమాట మీకు వివాహం—

కామ : అవును....మీరు చూడదలచుకొన్న స్త్రీకి దారిద్ర్య పీడితుల ఎడ సానుభూతి, కరుణ ఎంతవుంటే అంత మంచిది. నా డబ్బును వృధాగా విలాసాలకు ఖర్చు చెయ్యడం నాకు ఎప్పుడూ యిష్టంలేదు.. .నాడబ్బును సవ్యంగా ఖర్చుపెట్టి, నాకు శాంతి, యివ్వగల స్త్రీ కావాలి నాకు—

లత : చూద్దాం....ఇంకా ఆవిడకు చదువు, చక్కదనం—

కామ : మిగిలిన విషయాలన్నీ మీకే వదులుతున్నాను.

లత : అంటె—నాదే అంతిమ నిర్ణయం అన్నమాట.

కామ : తప్పకుండా—

లత : (ఒకక్షణం ఆగి) నాకు ఆత్మీయురాలైన ఒక స్నేహితురాలు వుంది....బహుశః ఆమె మీకు తగిన భార్యకావచ్చు.

కామ : చెప్పండి ఆవిడను గురించి.

లత : ఆమె వయసూ, నా వయసూ ఒక్కటే .. ఇన్నాళ్ళ నుంచీ ఆమెకూడా తండ్రికి రొమ్ముల కుంపటిగానేవుంది.

కామ : వచ్చిన సంబంధాలను తిరస్కరించడంవల్లనేనా ?

లత : అవును....ఎక్కువకట్నం యిచ్చుకోలేనివాళ్ళ పిల్లలకు ఎటువంటివారు వరులుగా వస్తారో మీకు తెలియనిది కాదు. చూస్తూ చూస్తూ ఒక అల్పుడికి—

కామ : (అడ్డువచ్చి) మూర్ఖుడికి, అనాగరికుడికి—

లత : (నవ్వి) భార్య కావడంకన్న అసలు పెళ్ళిచేసుకోక పోవడం మంచిది అని ఆమె వుద్దేశ్యం—

కామ : బావుంది.... ఇంకా చెప్పండి ఆవిడనుగురించి.

లత : ఆవిడమాట ఎంత కఠినంగా కనిపించినా, మనసు మాత్రం వెన్నపూస.... ఇంతవరకు ఆమె జీవితంలో ఆనందం ఎరుగనిది.

కామ : (సాలోచనగా) ఆమె ప్రేమించనివాడిని పెళ్ళి చేసుకోవడానికి యిష్టపడుతుందా ?

లత : అలా చేసుకుంటే ఆమెను మీరు గౌరవించలేరా ?

కామ : నేను ఆమాట అన్నానా? ఆవిడను నిర్ణయించవలసిన భారం అంతా మీదే! కుతూహలంకొద్దీ అడుగుతున్నాను. ఆవిడ అందమైనదేనా?

లత : ఏదో సంసారపక్షం—

కామ : (ఆమెవంకనే చూస్తూ) చాలు.... అయినా కోరికలకు అంతెక్కడ?

లత : ఆవిడను గురించిన ఒక విషయం మాత్రం నేను చెప్పక తప్పదు.

కామ : రహస్యమా?

లత : పెళ్ళిచేసుకొనేవారు తెలుసుకోవలసిన రహస్యమే ! (అతనిని చూడకుండా, తల మరొకవైపుకు త్రిప్పుకొని) చాలా ఏళ్ళ క్రితం ఆవిడ ఒక అతనిని ఎంతగానో ప్రేమించింది. వారిద్దరి పేదరికంవల్ల ఆ వివాహం జరగలేదు. కాని సంసారం నడవడానికి తగిన స్తోమత వచ్చేవరకూ అవివాహితులుగానే వుండాలని వాళ్ళు ప్రమాణం చేసుకున్నారు. (అని ఒక క్షణం ఆగి) కాని ఆరు నెలలు దాటేసరికి అతని పెళ్ళి అయిపోయింది.

కామ : ఆఁ ! నిజం ?

లత : అవును....ఓ లక్షాధికారి, ఒక్కతే కూతురుతో దేశం పర్యటిస్తూ పంజాబు వచ్చారు. అక్కడ అతన్ని చూసి తన, కూతురుకు తగిన వరుడినిగా నిర్ణయించుకున్నాడాయన—

కామ : (ఆమెవంక సూటిగా చూస్తూ) పంజాబులోనా !

లత : అవును.

కామ : (ఆమెకు దగ్గరగా వచ్చి) చూస్తే మీ స్నేహితురాలు నాకు నచ్చేటట్లుగానే కనిపిస్తున్నది.

లత : మీ విషయాలన్నీ సవిస్తరంగా ఆమెతో చెబుతాను... ఒకవేళ ఆమె మిమ్మల్ని పెళ్లిచేసుకోడానికి ఒప్పుకుంటే అది మీ డబ్బుకోసం మాత్రం కాదని నేను ఖచ్చితంగా చెప్పగలను.

కామ : ( దీర్ఘంగా నిట్టూర్చి, ఆ వెనుక చిరునవ్వుతో ) అయితే... ముహూర్తం పెట్టించమని మీ నాన్నగారితో చెప్పమంటారా లతా ?

లత : (సిగ్గుపడి, తల వంచుకొని నవ్వి) మీ యిష్టం—

కామ : లతా—(అంటూ ఆప్యాయంగా దగ్గరకుతీసుకుంటూ వుండగా—తెర)

(ఆల్‌ఫ్రెడ్ పత్రో ఆధారంగా)

జమ్ములమడక మాధవరాయశర్మ

# సాహిత్య గౌరవము

భారతీయుల సాహిత్యమునకు వేయి నాలుకలతో పలుకదగిన విశిష్ట గౌరవమున్నది. భారతీయత్వమునె యవలంబించి యా గౌరవమును గానము చేయవలయును. పాశ్చిమాత్యుల నీతిరీతుల ననుసరించి భారతీయ సాహిత్యమును చూడరాదు. ఇన్నినాళ్ళు చూడరాని విధమున చూచి చూచినామని తలచినవారు వంచితులయినారు. లోకమును విమార్గమున నుంచినారు. మన సాహిత్యమమార్గము చేరినట్లయినది. పాశ్చాత్యులు మన సాహిత్యమును చూడలేదు. చూడలేదనుట వారు సరిగా సమీక్షింపలేదని భావము. కొందరు కొందరు సమీక్షించిరి కాని, యా సమీక్ష కేవలము ప్రశంసలో పర్యవసించినది. తాము సమీక్షకులన్న ప్రశంస పొందుట కట్లుచేసిరి. వారు సమీక్షా దృష్టితో సమీక్షించియున్నచో పాశ్చిమాత్యులవశ్యముగా మన సాహిత్య ప్రభావితులయ్యెడివారు. ఈనాటికిని వారట్లయినట్లు తోచదు. పాశ్చిమాత్యులందు మన సాహిత్య ప్రభావము ప్రసరింపవలసినంతగా ప్రసరింపకపోవుటలో నొక హేతువుకలదు. మన సాహితీ ప్రభావమును వారు యథాతథముగ నందుకొనలేదు. ఏదేని యొక లక్షణ గ్రంథమును వారు పట్టినను వారివారి రచనల సంవాద విసంవాదముల నిరూపించుటకే పుటలు నింపిరి. అట్టి వారిదృష్టికి స్వీకార్యము కన్పడలేదు. మన సాహిత్యమున మన సాహిత్యలక్షణమున స్వీకార్య గుణములు లేనందున నట్లయినదనుట భావహాస్య చిహ్నము.

మన దేశీయ సాహిత్య లక్షణ సంవేదనమున నేడు మనదేశ సాహిత్యములకు గొప్ప ప్రయోజనమున్నది. ఈనాడు సాహిత్యమున నొక యవ్యవస్థ యేర్పడినది. విషయము వస్తువు వలసిన వారలకు సాహిత్య సామగ్రి యక్కరలేదు. సామగ్రి కావలసినవారలకు విషయ మక్కఱలేదు. ఇట్లు వారిలో వీరిలో సాహిత్యకావ్యము నలిగిపోయినది. సాహిత్యమున అవ్యవస్థ యేర్పడినది. ఈ యవ్యవస్థ వలన సాహిత్య ప్రతిష్టంభ మేర్పడినది. ప్రీతి వ్యుత్పత్తుల నిచ్చు సాహిత్యము నిర్మింపగల సాహితీ విశ్వనాథులు ఎందరో లేరు.

నవభారతము నవాంధ్రము సంస్కృతి రక్షించునది కావలెను. వైజ్ఞానిక సాంస్కృతిక సభాసమారంభములు సంస్కృత భాషా వాఙ్మయ ప్రచార పరాయణములై సారస్వతైకమత్యమును కూర్పగలుగవలెను. అప్పటి సముదయము పొందు ఉత్తమ సాహిత్య సమీక్ష లోకమునకు నవోన్మేషమీయగలదు. రత్నముల నందరు గుర్తింప లేరు. కావ్యము లందరికి తెలియవు. సహృదయ వైకటికులె కావ్యరత్న ధర్మముల గుర్తింప గలరు. రత్నములందలి జాత్యత కావ్యములందలి తత్త్వము సమీక్షాసరణిని చక్కఁపఱచ గలవు. సమీక్షింపదగని వానిని సమీక్షించుట, సమీక్షింపదగినవానిని సమీక్షింపకుండుట నేటివఱకనర్థమయినవి. సమీక్షా కంచుకమునో నేడీ విధములు కొన్ని దుర్విధములై వ్యాప్తము లయినవి.

దేశకాలచరిత పద్ధతి పాత్రవస్తు విశకలిత రీతి, క్రోచే సూచితసౌందర్య రీతి, ఫ్రాయిడ్ కామవాసన, ఎడ్లర్ ప్రభుత్వ కామన, యుంగ భావమూల సంస్కారము, మార్క్స్ ఆర్థికనీతి, మనోవిజ్ఞాన విధానము, రాజకీయదృష్టి సమీక్ష, ధార్మికతత్త్వ పరీక్షా సమీక్ష, భాషా దోషగుణ

పరీక్ష, సంవాద విసంవాద పరిశీలనము, కర్తృ సంభావనా పరీక్ష, తత్తద్వర్గ కులాభిమాన దృష్టి, రాష్ట్రీయ భావోద్దీపన విధము, జాతీయ భావ స్పందము

మొదలైన యనేక విధముల నేడు కావ్యముల పరీక్షింపదలచువా రసహమతులై విమర్శించు చున్నారు. ఒక రొకరిని సహింపరు. అవుననరు. ఇది యంతయు పాక్షికమయినరీతి. ఇది సమీక్షయు కాదు. కవి భావనమును భావించుటలో నొక సమర్థత యావశ్యకము. ఆవశ్యకము లేకున్నను కొందరు భావింతుమందురు. తాము కల్పించు కొనిన తమ భావములను తాముగా చెప్పుకొనుటకు జంకి వీరు కవులం దారోపింతురు.

కవులు కావ్యరూపముననె జీవింతురు. కవి రూపమున కావ్యమును జీవింపచేయదలచుట యన ర్థము. అందుననే కర్తృవిస్మరణ మావశ్యకము. నేడు విరుద్ధములయిన కుంటిగతులతో కూడుకొనిన ఈ విమర్శవిధులను విస్మరింపజేయుటకై యొక ప్రతిక్రియావాదమును వెలువడ జేయవలసి యున్నది. ఇట్టి ప్రతి క్రియాత్మకమయిన వాద ప్రతిఘటనములో రసదృష్టి భావుకులకుదయించును. వారు ధ్వన్యధ్వ సంచార మొనరింపగలరు. కావ్య ధర్మమర్మము గుర్తింపగలరు. అట్లు గుర్తించు సహృదయభావు లవతరించిన గాని కవితలు బ్రతు కవు. ఇక్షురసమువలె కావ్యకల్పమంతయు రస్య మానము కావలెను. బౌద్ధ ధర్మకీర్తి యొకప్పు డిట్లు వాపోయినాడు.

"లావణ్య ద్రవిణవ్యయము గణింపలేదు. క్లేశమధికమయినది. స్వచ్ఛంద సంచారులయిన జనుల హృదయమున చింతాజ్వరమును కలిగి నది. ఆమెయు తన గుణములకు తగిన రమణుడు లేనందున గతించినది. ఈ తన్వినిర్మాణ మొన రించిన బ్రహ్మ భావించినదేమి ?"*

ఇది యొక శ్లోకభావము. ఇది రాగిజనుని వచ నముకాదు. అశ్లేయయిన "తగిన రమణుడులేమి" పలుకుట యుండదు. ఇది విరాగి వచనమనుట సంగతము కాదు. యతికి రతి యనుట పరివ్రాజ కునకు సంతానమనుట. అట్టివాని కిట్టి విషయము లందు ప్రసక్తి తగదనియె మనమనుకొందుము. అసలీ పద్యములో రాగి విరాగి రాగాపరాగములు లేవు. కవి కవితను వ్రాయుటలో సామగ్రీ పౌష్కల్యము సంతరించుకొనును. క్లేశముపడును. ఇట్టి మంచి కవితకు తగిన యవలంబము లేకపోయి నదే యని యువభావుకులు చింతాజ్వరము పడిరి. ఆ కవితయు తగిన సహృదయుడులేక అంతరించినది. ఈ కవితను నిర్మాణించిన కవి యూహయేమి ?" ఇట్టిది పద్యభావము. కవి సహృదయ ముఖుడు. సహృదయుడు కావ్య హృదయుడు. కవి సహృ దయాఖ్యతత్త్వమె లోకవిజయి. కావుననె యంతట భావమయతంతు వుండుట యావశ్యక మయినది. రసభావమయ కళావిర్భావ మపేక్షిత మగుచున్నది. అప్పుడె యంతస్తత్త్వ శోధనము కలుగును. శమాత్మక వృత్తి యుదయించును. ఈ జీవనము దివ్యజీవనమగును,

కవితారీతు లయిదు విధముల నుండును. ఒక రీతి యశోర్థముల నిచ్చును. రెండవది నానావిధ వ్యవహార పరిజ్ఞాన మాపాదించును. మూడవది బాధల పోగొట్టును. అమంగళము నశింపజేయును. అనిష్టము తొలగించును. నాల్గవది నిరతిశయ నిర్వృతి నాపాదించును. అయిదవది కాంతా సమ్మితమై యుపదేశప్రదమగును. ఏ కవితయం దయిన నీ యయిదు స్వరూపము లసంగతము చేయుట కవకాశ మున్నచో నది యుత్తమ సాహి త్యము కాగలదు. మమ్మటుడు తన కావ్య ప్రకా శలో నీ యంశ ముట్టంకించినాడు.

---

* లావణ్య ద్రవిణవ్యయో న గణితః క్లేశో మహానర్జితః స్వచ్ఛందం చరతో జనస్య హృదయే చింతాజ్వరో నిర్మితః
ఏ షాపి స్వగుణానురూపరమణాభావా ద్వరాకీ హతా కోర్థశ్చేతసి వేధసా వినిహిత స్తన్వ్యా మిమాం తన్వతా॥

ఆంధ్ర భూమిలో నిన్న మొన్నటి వఱకు వచ్చిన కవితోద్యమము లవి యెన్నియో కలవు. అందు కొన్ని నేటికిని బ్రతికి యున్నట్లున్నవి. పాశ్చాత్య పాలనమున గలిగిన యీ విశేషములు ఏ బి సి డీల ప్రాణనముతో నున్నవి. అ ఆ ఇ ఈల ప్రాణనము వీనికి కలిగినచో నివి యిట్లుండవు. ఇవి యన్నియు భారతీయాకృతి పొందక తప్పదు. మనవారికి కొందరికి సాహిత్యకమయిన యాంధ్యము పట్టినది. అది పోవుట కొక సాహిత్యాంజనము కావలెను. సాహితీవ్యవసాయము నష్టప్రాయముగ గన్పడును. భావుకులు భావదాసులై పాశ్చాత్య భావ భావితులయినారు. యాంత్రిక మార్థికమయిన పరివర్తము కలిగినపుడు యుద్ధరీతులు పరిణామముల తెచ్చిపెట్టినపుడు మన నవస్వాతంత్ర్యము నవాంధ్ర సంపత్తి యనుకూలాస్వాద మీయవలసి యున్నది. మన యలంకారశాస్త్రమర్యాదానుసారమున మన సాహిత్యమును మనమాస్వాదించుటయే మన సాహిత్యగౌరవము.



(౨వ పేజీ తరువాయి)

అనువాదం చదివాక ఎవరు తెనిగించారో తెలుసుకుందా మన్న కోరిక పాఠకునికి సహజంగా పుడుతుంది. కనుక ముమ్మందు అనువాదకుల పేర్లుంచుతూ ఉండండి.

సమీక్షలు పుస్తకాల యోగ్యతల్నిబట్టి వుండాలి. అంతేకాని ఏవో వచ్చాయి కదా శీర్షిక కోసమైనా వ్రాయాలిగదా అని పెట్టుకోకూడదు.

పత్రికలో అచ్చు తప్పులు లేకుండా చూడాలని కోరుతున్నాను.

*వేంకటరత్నం*
యల్లమిల్లి

మీరు సంపాదకీయమున వ్రాసికొన్నట్లు రచయితల హెచ్చుకుందులు నిర్ణయించు ప్రయత్నమిందు కొంత కలదు. అది పెట్టుబడిదారి వర్గము యొక్క అభిరుచి....తొలి సంచికను యింత జయప్రదముగా సహృదయ లోకమునకు అందించిన సంపాదకులకు నమస్కారము.

*దిగుమర్తి సీతారామస్వామి*
భీమవరం

గెటప్ దరిద్రంగా వుంది....సంపాదకీయం మొత్తానికి బాగానేవుంది....రెండవ సంచిక రచయితల పేర్లుచూస్తే పత్రిక బాగుంటుందని ఆశ కల్గుతున్నది.

*జె. రాఘవేంద్రరావు*
గుడివాడ

ముఖస్తుతి కాదనుకుంటే ఒకమాట. పత్రిక చాల బాగుంది. స్వతంత్రమైన కథానికలతోపాటు విశ్వసాహిత్యంలో స్థానం సంపాదించుకున్న కథల అనువాదాలు వేయడం ముదావహం. ప్రతి సంచికలో ఒక కథానువాదాన్ని అందించగలరని ఆశిస్తున్నాను.

*కంచి వాసుదేవరావు*
మచిలీపట్టణము

# వధూనిక | దాశరథి

ఎద పొదలో చిక్కి ఎటు పోవజాలని లేడికి దారి కల్పించు నెవతె
కన్నీటి వానలో కడునాని రెక్కలాడని పక్షి నొడినుంచుకొనున దెవతె
దుఃఖ ఝుంఝానిలోద్ధూత పుష్పమునకు కబరికాపీఠ మీగలుగు నెవతె
ఆకురాలిన గుండె మ్రాకు కూకటిలోన చిగురుటక్షతలను చిమ్ము నెవతె

పలుకజాలని జీవ విపంచి దీసి
తీవ సవరించు శారదాదేవి యెవతె
భారతీరమోమా సమాహారమైన
మాతృ త్రితయస్వరూపిణి భ్రాతృజాయ.

చీకటి జీవితమ్మునకు చిక్కని వెన్నెల పాలువోసి, చీ
కాకుల చిక్కులన్ జివికి కారియవడ్డ మనమ్ము మ్రోడు మా
రాకులు హత్తగా అమృతహస్తము సాచి వసంత శాంత వే
శా కుటజాంత కుట్మల విలాసము చూపెదవే వధూనికా!

వానకాలమందు కానల కోనల
చెట్ల కొమ్మలందు చిన్నిగూట
రెక్క గొడుగుక్రింద డొక్కల పక్కల
పట్టిగాచు తల్లిపిట్ట వీవు.

నీ చేలాంచల చంచలారచిత కాంతిశ్రీ లుదారమ్ములై
నాచేతమ్మున అంధకార కృత బంధగ్రంథులన్ డుల్చె మా
యా చక్రమ్మున క్రిందుమీదగు జగం బర్థమ్ముకాజొచ్చె; నే
యాచింతున్ భవదీయ మాతృహృదయ వ్యాకోచసంకోచముల్.

కైలాస శిఖరమ్మె కలదు నీ ఫాలాన పరమశివుండు కావలెనె నాకు
కల్పభూజమ్ములు కదలె నీ ఎదలోన వాసంతలక్ష్మి కావలెనె నాకు
పుష్కలావర్తకాంబుదము నీ కనులలో వాసింప గంగ కావలెనె నాకు
నీపాదములు పద్మనీకాశములుకాగ లేమిమాటల నుచ్చరింపనేల

అన్నపూర్ణవై నీవింట నున్నయపుడు
తిండికై తిరిపెమ్మెత్తి తిరుగనేల ?
సింధువై నీవు వాకిట జీరువార
అంధువుల నాశ్రయింపగా నరుగనేల ?

భ్రాతృజాయా కరస్పర్శనొందిన వల్లి శిశిరమ్మునకు భీతిజెందబోదు
వదిన పాదాంబుజద్వయి మెట్టిన గృహంబు అంధకారముజూచి అడలబోదు
ఆమె కటాక్షవీక్ష మరందములాని వేపకొమ్మలచేదు విరిగిపోవు
పెదవిపై నవహర్ష మృదుచంద్రికలు పూయ వర్షవేళా శరద్భ్రాంతిదోచు

ఉదయవేళార్క బింబంబు మృదుకరాల
ఆమె ముఖసీమ కుంకుమ నద్దిపోవు
సాంధ్యవేళా శశాంక కాషాయబింబ
మామె నఖముఖముల రాగమద్దవచ్చు.

ఆమె జగత్కుటుంబిని, దయామయి, ఆదిసవిత్రి, శారదీ
యామృతరుక్ సుమస్తబక హారి శిరోరుహభార, భూదివ
స్స్వామిని, దీన బాంధవి, ప్రశాంత దిశాంత నిశాంతకృత్ చిరిం
టి మణి, ఆమె పాదముల నిల్పెద నాశిర మెల్లకాలమున్.

# పాపజీవి | శివప్రసాద్ సింగ్*

అర్థరాత్రి గడచింది. అంధకార సముద్రంలో చిన్న దీపంవలె తూర్పుదిశాకాశంలో పొడిచిన శుక్ర తార మిణుకు మిణుకు మంటూంది. గోడకొరిగి మోకాళ్ళలో ముఖం దాచుకొని బద్లూ కూర్చున్నాడు. వాని ముందర ఎండుగడ్డిపై వాని కూతురు టూరీ మశూచికపు మంట నోర్చుకోలేక కొట్టుకొంటున్నది. కూతురు స్థితి చూచినప్పుడల్లా వాని దేహంయొక్క ప్రతి రోమం బాధచేత మెలికలు తిరిగిపోతున్నది. ఆపిల్ల పడుతున్న బాధనంతా, ఆ మంటనంతా తన దేహంలోనికి గుంజుకోవాలని బద్లూ కోరుతున్నాడు. తన కోరిక సఫలం కావటానికి ఏ మార్గమూ లేదని వానికి తెలుసు. తేలుకాటు తిన్న మూగవానివలె వాడు బాధను సహిస్తున్నాడు. నోరులేని పశువువలె కండ్లప్పగించి కూతురువైపు చూస్తున్నాడు.

"అయ్యా! నీళ్ళు-" ఎగపోస్తూ పిలిచింది టూరీ.

బద్లూ లేచి టిన్ను గిన్నెలో నీళ్ళు తీసుకొని కూతురు తలదగ్గర మెల్లగా కూర్చొని గిన్నె దాని పెదవుల కంటించాడు. టూరీ గిన్నెడు నీళ్ళు ఒక్కదమ్మున గటగట తాగి శోషవచ్చిన దానివలె పడిపోయింది. కాలుతున్న ఆమె చేయి బద్లూ చేతిని పట్టుకొన్నది.... "అయ్యా"

"ఏం తల్లీ - ఏం కావాలో చెప్పు." ఆమె మాట వినడానికి తన చెవిని పిల్ల పెదవుల దగ్గఱకు తీసుకుపోతూ అన్నాడు బద్లూ.

"దొంగతనం చేయకు" అన్నది టూరీ.

బద్లూ ఉలికిపడ్డాడు. మనస్సుకు బాగా దెబ్బ తగిలింది. బాధతో వాని శరీరంలోని అణువణువూ కంపించింది. నోటినుంచి మాట రాలేదు.

"చెయ్యవు కదా? చెప్పవేం?" పిల్ల మళ్ళీ అడిగింది.

"చేయను." మాట కష్టంగా పెకిలింది. దెబ్బ తిన్న మనస్సుతో బద్లూ మళ్ళీ అదేచోట వీపు గోడకానించి కూర్చున్నాడు. ఆ నాడు తల్లిచెప్పిన మాటలే ఈ నాడు టూరీ చెప్పుతున్నది అనుకున్నాడు బద్లూ. తనకూ తన భార్యకూ ఎప్పుడూ పడలేదు. పీటిదుంపలూ, అడవి పూలూ, కమల బీజాలూ, మోదుగాకులూ, దొన్నెలూ అంగడిలో అమ్ముకొని ఇంటికి తిరిగి వచ్చినప్పుడల్లా బద్లూ వెంట సారాయి తెచ్చుకోవటం మరచేవాడు కాదు. డబ్బట్లా పాడుచేసినందుకు వాని భార్యకు తెగకోపం వచ్చి వాని తాత ముత్తాతలను ఏడు తరాలవరకూ గంగలో కలిపేది. ఇక సహించటం చేతకాక బద్లూ అరచేవాడు; "ఏయ్ టూరీ, ఎక్కడున్నావ్. ఆ కట్టె ఇటు తీసుకరా, దీని కండలు తీసి కాకుల కేస్తాను." తండ్రి కంఠం విని భయపడి నల్లిపిల్లవలె టూరీ తన చాప చింపుకు అతుక్కుపోయేది. వాని స్వరం విని చుట్టుప్రక్కల ఎఱుకల గుడిసెల చుట్టూరా చెత్త కుప్పల్లో పురుగుల నేరుకొంటున్న కోళ్ళు బుర్రుమని ఎగిరి ఆకాశం వైపు చూచేవి. నిరాశ చెందిన బద్లూ, లోకంయొక్క నీతినీ, ఎడతెగకుండా వీస్తున్న అడవిగాలినీ, ఎందుకూ అక్కరకురాని

---

* శివప్రసాద్‌సింగ్ హిందీ కథా రచయితలు. ప్రస్తుతం వీరు బనారసు విశ్వవిద్యాలయంలో అధ్యాపకులుగా నున్నారు. ఈ కథ మొట్టమొదట ౧౯౫౫ ఆగస్టులో హిందీ మాసపత్రిక 'కల్పన'లో ప్రకటించబడినది. VAK ప్రథమసంచికలో దీని ఇంగ్లీషు అనువాదం ప్రకటించబడినది. సం.

తన కూతుర్నీ తిడుతూ, శపిస్తూ, చేతులు నలుపుకొంటూ కూర్చునేవాడు. ఆ చేతులు నలపటంలోనే మెల్లమెల్లగా వానికోపం అంతమైపోయేది.

రాగబంధాలన్నీ తెంచుకొని నిరుటి సంవత్సరం వాని భార్య తనదారిన తాను పోయింది. కాని చనిపోయేముందు టూరీని బద్లూఒళ్ళో కూచోబెట్టి, నిర్జీవమయ్యే తన కళేబరంమీద ఒట్టుపెట్టించుకొనిచెప్పింది "చూడు—ఈ పిల్లను కాపాడుకో – దొంగతనము చేయకు" అని.

నాటినుంచి నేటివరకూ బద్లూ దొంగతనం చేయలేదు. దొంగతనం చేయటంవల్ల తనతండ్రి బబ్బర్‌కు పట్టినగతిని వాడెన్నడూ మరచిపోలేదు. ఇంతవరకు న్యాయంగా బ్రతకటానికి తనచేతనైనన్ని ప్రయత్నాలు చేశాడు. కాని.... తండ్రి జ్ఞాపకం రావటంతోనే బద్లూ కండ్లలో నీళ్ళు నిండినవి. నీటిలో ఆడుతున్న చేపవలె వాని సజలనేత్రాల్లో విశాలమైన తనతండ్రి రొమ్ము మెరసింది. రొమ్ముమీద తేనెటీగల్లాగా రాగివన్నె వెంట్రుకలు మెరిసినవి. బబ్బర్ సారాయి తాగేవాడు. గంజాయి పీల్చేవాడు. వాటి విషాల్లో భార్యనూ, కొడుకునూ తెగ తన్నేవాడు. ఇంత తన్నినా, సాయంకాలం అలసిసొలసి చెఱువులనుంచీ, కోసిన వరిపొలాల్లోంచీ బబ్బర్ తిరిగి వచ్చినపుడు వాడొక సంచిలో నీటిపాములూ, కప్పలూ, ఎఱ్ఱలూ, అన్నీ తెచ్చి గుడిసెముందు వాకిలిలో ఎగచల్లేవాడు. చిన్న చిన్న పిల్లలంతా చప్పట్లు కొట్టుతూ అరుస్తూ ఆ జలజంతువులతో ఆడుకొనేవారు. ఇంకొక సంచిలో వరిగొలుసులు తెచ్చేవాడు. వీనిని వాడు చాలా కష్టపడి ఎలుక కలుగులు తవ్వి సంపాదించేవాడు. ఆనాడు వానికి దీపావళి వచ్చినంత సంతోషం. ఎన్నాళ్ళనుంచో ముట్టకుండా చిలుకకొయ్యకు తగిలించి ఉన్న లంగోటీ తీసి కట్టుకునేవాడు. గొంతెత్తి బద్లూను పిలిచేవాడు. బద్లూ ఈ సంతోషాన్ని పట్టలేక ఆ సమయానికి తనకుక్కను వెంటబెట్టుకొని ఏదుల (ముళ్ళపందుల) కలుగులు వెదకుతూ, అడవికోళ్ళను వెంటాడుతూ, కుందేళ్ళ వెంట 'హీహో హీహో' అని పరుగెత్తుతూ ఉండేవాడు. లేకపోతే జమీందారుగారి పెండ్లికి వచ్చిన భోగంది పాడిన పాటలోని ఏదన్నా చరణం జ్ఞాపకానికివస్తే అడవిమల్లెలు మొదలైన పూవులేరి వాటిరెక్కల్ని తుంచి గాలిలో ఎగరవేస్తూ ఉండేవాడు.

"బద్లూ"—గొంతెత్తి పిలిచిన తండ్రికంఠం విని వాడు ముండ్లపొదల్ని దాటుతూ, దుముకుతూ, వచ్చి తండ్రిఎదుట నిలబడేవాడు. బబ్బర్ చేతులుచాచి కొడుకును దగ్గఱకు తీసుకునేవాడు. బద్లూ రాగి వెంట్రుకలున్న గజంవెడల్పైన తండ్రి వక్షస్సుకు కోతిపిల్లవలె అతుక్కుపోయేవాడు.

"ఏమిరా ? దొరవైతావా ?" అని బబ్బర్ బద్లూ చేతులపై తొడలపై వక్షస్సుపై గుప్పెడు మన్నువేసి దయలేకుండా నలిపేవాడు. అప్పుడు బద్లూకూడా తండ్రి దేహాన్ని మన్నువేసి నలిపేవాడు. ఇద్దరి నల్లని దేహాలపై ఇసుకరేణువులు అభ్రకచూర్ణంవలె ధగధగా మెరసిపోయేవి. తండ్రికొడుకులిద్దరూ గోల పెట్టుతూ ఒక్కటే నవ్వు నవ్వేవారు. ఆ ఎఱుకల వాళ్ళ చిన్న పల్లె వాళ్ళిద్దరి నవ్వులతో ప్రతిధ్వనించేది.

చల్లనిగాలి రివ్వుమని వేగంగా వీచి వెదుళ్ళ గుడిసెను ఒక్క ఊపు ఊపింది. కప్పుకున్న దుప్పటి లోంచి టూరీ శరీరాన్ని తాకింది.

శరీరంలోని రక్తాన్నికూడా గడ్డగట్టించేట్టుగా చల్లగాలి వీచినప్పుడల్లా చలితో బద్లూ వణకుతూ దవడలాడించేవాడు. అప్పుడు బబ్బర్ వాన్ని చేయిపట్టి నిల్చోబెట్టేవాడు.

"అరే ఆకువలె వణకుతున్నావేమిరా ? తీయి దండాలు తీయి" అని తానుకూడా చెమట వచ్చే వరకూ దండాలు తీసేవాడు.

ఆ కోస్తాలో ఉన్న ధనవంతులందరూ బబ్బర్ పేరు చెప్పితే గడగడలాడేవారు. వాడు దొంగలకు రాజా, బందిపోటులకు గురువు. కఱ్ఱసాములో అద్వితీయుడు. వేయిమంది సమూహాన్ని చీల్చుకొని వాడు సునాయాసంగా, ఒక్క చిన్నదెబ్బైనా తినకుండా బయట పడేవాడు. పక్క ఊళ్లోని ముద్దన్ ఆహీర్

(పశువులను పెంచి, పాలమ్మికొనేజాతి) ఆకాలంలో కఱ్ఱసాములో చాలా పేరుగలవాడు. ఆ సంవత్సరం నాగపంచమి తిరునాళ్ళలో ముద్దన్ కొడుకొకడు ఎఱుకల పిల్లవాన్ని కొట్టి మాటల మాటల్లో బబ్బర్ లబ్బా అని తిట్టి చేతనైతే వచ్చి ముద్దన్‌తో కొట్లాడ మన్నాడు. అప్పటినుంచీ వాళ్ళిద్దరికీ పడలేదు. బబ్బర్ ఆ అవమానాన్ని సహించి ఊరుకోలేదు. ఆ సంవత్సరమే బబ్బర్ గట్టులొరసి పారుతున్న గంగానదిని దాటి అర్ధరాత్రివేళ ముద్దన్ ఊళ్లో చొరబడి వాని చేతిలోనుంచే వాని గేదెను విడిపించి లాక్కొని వచ్చాడని ప్రతీతి. కాని ఈబలం, ఈ సాహసం, తుదకు ఎందుకూ అక్కఱకురాలేదు. ఒకనాటి రాత్రి దొంగతనం చేస్తుండగా వాడు పట్టుబడ్డాడు.

ఈ రాత్రివలెనే ఆరాత్రికూడా తుపానుగాలి వీస్తున్నది. తల్లీకొడుకు లిద్దరూ చిరుగుల దుప్పటి కప్పుకొని చలికి వణకుతూ అమ్మవారికి మ్రొక్కుకుంటూ రాత్రంతా ఆదేపనిగా ఎదురుచూస్తూ కూచున్నారు. పరిచితమైన పదధ్వని వినరాలేదు. తెల్లవారిందికాని బబ్బర్ రాలేదు. తెల్లవారిన తరువాత పక్కింటివాడు వచ్చి చెప్పాడు. పరిసియాలో ఠాకుర్ ఇంట్లో దొంగతనం చేస్తుండగా బబ్బర్ పట్టుపడ్డాడని. వార్తవిని బద్లూ తల్లి గొడ్డలివేసినట్లువిలవిలలాడింది. తల్లికొడుకు లిద్దరూ బబ్బర్‌ను చూడటానికి ఊళ్ళోకి వెళ్ళారు. అక్కడ జమీందారుగారి బావిగోడ వెనుక దాక్కొని బబ్బర్‌ను చూచారు. జమీందారుగారి ఇంటిముందట బబ్బర్‌ను ఒక స్తంభానికి విరిచి కట్టారు. కఱ్ఱ దెబ్బలతో వాని శరీరమంతా పగిలింది. అక్కడక్కడ నల్లనిరక్తం గడ్డకట్టింది. వాని చుట్టూరా జనంమూగారు. ఒకడు కాలితో తన్నుతున్నాడు, ఒకడు పైనఉమ్మి వేస్తున్నాడు, ఒకడు తిట్టుతున్నాడు.

"కఱ్ఱకాల్చి వాని కళ్ళల్లో పెట్టండి, అప్పుడుకాని వాడు పలుకడు." అన్నాడు ఠాకుర్ కోపంతో.

పిడుకలతో చేసిన నిప్పులో కఱ్ఱను ఎఱ్ఱగా కాల్చారు. ఆ కఱ్ఱ తీసికొని ఒకడు ముందుకు నడిచాడు. బావిచాటుకు దాగున్న వానిభార్య మొత్తుకుంటూ ముందు కురికి ఠాకుర్ కాళ్ళమీద పడ్డది. కొంద ఱామెనుకూడా వెంట్రుకలు పట్టిలాగి నానా తిట్లూ తిట్టారు. తుదకు ఠాకుర్‌గారి మున్షీ వద్దనటం వల్ల ఠాకుర్ ఆపని మానుకున్నాడు. ఏమో! కన్నులు తీసేస్తే తరువాత మన కంఠందాకా రావచ్చు. ఎముకలు విరుగ తన్నటమే ఇంతకంటె మంచిది. భయం లేని పని.

"వాని కది చాలదు దొరా!" అంటూ వచ్చాడు ముద్దన్. ఇనుప అంచులు వేసిన పొడుగాటికఱ్ఱ నాడిస్తూ. "దొంగలు దొంగ లన్నదమ్ములు. వీనికి తగినదెబ్బ నాకే తెలుసు. వీణ్ణి నాకు వదలేయండి" అంటూ తన కఱ్ఱతో వెన్నులో ఒక్కపోటు పొడిచాడు. బాధతో మూలిగాడు బబ్బర్. బావిగోడవెనుక దాక్కొని బద్లూ ఇదంతా చూస్తున్నాడు నీళ్లు నిండిన కళ్ళతో. ఇక చూడలేక పరుగెత్తిపోయి తండ్రిమీద పడ్డాడు. పిల్లవాణ్ణిచూచి ఎత్తినకఱ్ఱ దింపాడు ముద్దన్.

"ఏంచేశాడు మా అయ్య?" ఈ మాటలు బద్లూ అన్నాడో లేదో బబ్బర్ వాణ్ణి తన శరీరంపైనుంచి దులిపి దూరం పారవేశాడు. కోపం వెళ్ళగ్రక్కుతూ వానివైపు తీక్షణంగా చూడటం మొదలు పెట్టాడు. అసలు కోపం రావలసిన అగత్యమేమిటో బద్లూ కర్థం కాలేదు. తన తండ్రిని రక్షించుకొనే ప్రయత్నమే కదా తను చేసింది? భయపడి, తానేదో అపరాధం చేసినట్టుగా తండ్రివైపు చూడటం మొదలు పెట్టాడు. కాని మళ్ళీ తండ్రిదగ్గరకు పోవటానికి సాహసించలేదు.

బద్లూ తల్లి ఎంత ఏడ్చినా ఎవ్వరూ వినలేదు. ఆనాడు సాయంకాలం పోలీసువచ్చి వాన్ని స్టేషన్‌కు తీసుకు వెళ్ళారు. తరువాత వానికొక సంవత్సరం శిక్షపడ్డది. ఏమైందో తెలియదుగాని వాడు జైల్లోనే చచ్చిపోయాడని తెలియవచ్చింది. పట్టుబడ్డప్పుడు ముద్దన్‌కొట్టిన లాఠీ దెబ్బవల్ల వాని కాల్జానికి దెబ్బ తగిలి అందువల్ల చచ్చిపోయాడని కొందరన్నారు. రోగంవచ్చి చచ్చిపోయాడని కొందరన్నారు. పలు

మంది పలువిధాలుగా అన్నారు. నిజ మెవరికి తెలుసు?

బద్లూ మండుతున్నకళ్ళలో నీటి బిందువులు మిల మిల మెరసినవి. తన చల్లని చేతినెత్తి ఆ నీటిని అంగీతో తుడుచుకున్నాడు. ఈ అమూల్యధారాన్ని వాడు భూమిమీద పడపీయదలచుకోలేదు. హృదయ క్షోభం గలిగించే ఈ స్మృతులు కరిగి కన్నీటి బిందువులుగా మారటం వాడి కప్పుడప్పుడు మామూలే. బద్లూ తన మనస్సులోని బాధనంతా అణచుకొని గుడిసెలోని చీకటిని చూడసాగాడు. దుఃఖము, బాధ, వాని కపరిచితములు కావు. కాని అవి పెల్లగించుకొని పైకి వచ్చినప్పుడు మనస్సెంత మండిపోతుందని వాడికీ తెలియదు. హృదయంలో పచ్చికట్టె కాలుతున్నది. అందులోంచి బయల్దేరే పొగ శ్వాస నవరోధిస్తున్నది. వచ్చే వెట్టవల్ల ముఖం ఎఱ్ఱబారుతున్నది.

గోడ కానించిన శరీరాన్ని దూరం జరిపాడు బద్లూ. ఒకేచోట ఒరిగి కూచోటంవల్ల వాని వెన్ను నొప్పిపెట్టింది. మోకాళ్ళ నడుమనుంచి తలయెత్తి వెదుళ్ళ సందులోంచి శుక్రతారను చూడసాగాడు బద్లూ. ఆకాశంలో నిర్ధూమమైన అగ్నికణంవలె అది ధగధగ లాడిపోతున్నది. ఆ తార ఎట్లా మండిపోతోందో? క్షుధాగ్నివల్ల బద్లూ ఎముకలు కూడా కాలి బూడిద ఐపోయినవి. ఈ కడుపుకోసం వాడేం చేయలేదు? ఇన్నాళ్ళు వా డెట్లా బ్రతికాడో ఆలోచించినప్పుడు వానికే ఆశ్చర్యంగా ఉన్నది. వా డెప్పుడో ఎందుకు చావలేదు? తల్లి చచ్చింది. భార్య చచ్చింది. తానింకా బ్రతికే ఉన్నాడు. అవమానం తప్ప యింకొక చెరుగని వాని బ్రతుక్కు అంతమనేది లేనేలేదేమో?

—

ఇంకా తెల్లవారలేదు. రాత్రంతా నిదుర లేకపోవటం మూలంగా బద్లూ కునుకుపాట్లు పడుతున్నాడు. టూరీ అరిచింది. బద్లూ ఉలికిపడి లేచి దగ్గరకు పోయి చూచాడు. బటానీ విత్తుల్లాంటి మశూచికపు పొక్కులు దాని శరీరం నిండా పొడిచినవి. సహింపరాని బాధచేత పిల్ల కిందుమీదౌతున్నది. తన రెండు చేతులలో పిల్ల కంఠం నలిపెట్టి 'టూరీ' అని రుద్ధస్వరంతో పిలిచాడు బద్లూ. టూరీ మాట్లాడలేదు. కన్నీళ్లు కారుస్తూ తండ్రివైపు చూస్తున్నది. బద్లూ నిలువెల్ల కంపించి పోయాడు. అయ్యో! ఇంత బాధ నా బిడ్డ ఎట్లా ఓర్చుకొంటుంది? నల్లని నాగుబాములు ప్రాకుతున్నట్లు అంతటా చీకటి. ఇక తెల్లవారదా ఏమి? కోళ్ళుకూడా కూయటానికి భయపడుతున్న వేమో? టూరీ స్థితి మరింత విషమించింది.

అడవి మధ్య పెద్ద రావిచెట్టు మొదట ఎఱుకువాళ్ళ దేవత చిన్న శిలావిగ్రహ రూపంలో ఉన్నది. కోడిపిల్లల నెత్తురువల్లా, సిందూరపు బొట్లవల్లా ఎఱ్ఱని శిలగా తయారైంది విగ్రహం. బద్లూ పిచ్చివానివలె ఆ ఎఱ్ఱని తాయి యెదుట మోకరించి తలానించాడు. "తల్లీ, టూరీ...." ఏవో అస్పష్ట శబ్దములు వాని నోటినుంచి వెలువడుతున్నవి. వాడు పిల్లవానివలె వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు. కట్టెలు కొట్టటానికి బయలుదేరిన కరీమన్ వచ్చి మెల్లగా వానితో అన్నాడు. "ఏడుస్తే ఏం లాభ మన్నయ్యా. కాలం బాగాలేదు. తల్లి లోకులను మింగేసే ట్టున్నది. ఇట్లా వినదు. కొంత నెత్తురు చవిచూపు. తల్లికి దయ వస్తుందేమో?"

గిన్నెడు పాలతో, కాగితపు జండాతో, కోడిపిల్లల నెత్తురుతో, ఆ అమ్మవారు ప్రసన్నురాలౌతుందని బద్లూకు బాగా తెలుసు. కాని....ఇవన్నీ ఎక్కడినుంచి రావాలి? హోరుగాలిలో నల్లపిట్ట పిల్లలు అరచినట్లు వాని మస్తిష్కంలో వేలకొలది రోదన ధ్వనులు వినరాసాగినవి. దొంగతనం....ఊఁహుం- చేయటానికి వీల్లేదు. మరేం చేయాలి? వాని నొసటిపై చెమట బిందువులు కూడినవి. నల్లని పెదవులు సన్నని రేఖగాబిగించి వాడు తన చెంపపై తానే కొట్టుకున్నాడు. ఆత్మగ్లాని వాన్ని విరక్తుణ్ణి చేసింది. పోయినవారం సంపాదించిన కూలి డబ్బులన్నీ త్రాగటంలో నాశనం చేయకపోతే ఇప్పుడు అమ్మవారి మ్రొక్కు తీర్చుకొని టూరీప్రాణం తాను కాపాడుకో గలిగేవాడు.

పరిసియాకు వెళ్ళే బాటకు ఎడమప్రక్కన ఎఱ్ఱ ఇటుకలతో కట్టబడ్డ ఒక చిన్నబంగ్లా ఉన్నది. అది కట్టటం పూర్తై ఇంకా రెండునెలలుకూడా కాలేదు. ఈ బంగ్లాలో ప్రక్క అడవిలోని మోదుగుచెట్ల గుత్తేదారు ఉంటాడు. ఈ అడవిఅంతా పూర్వం'బ్రహ్మబాబా' పేరుమీద వదలిపెట్టబడిందని ప్రసిద్ధి. భూమి అసలు ఆఊరు ఠాకుర్లది. వాళ్ళెప్పుడో పూర్వమొక బ్రాహ్మణున్ని హత్యచేసినారనిన్నీ అందువల్ల ఆ భూమంతా ఆ బ్రాహ్మణుని పేరుమీద వదలిపెట్టినారనీ చెప్పుకుంటారు. భయంవల్ల ఈ ఐదువందల ఎకరాల భూమిలో ఎవ్వరూ బహిర్దశకు కూడా వెళ్ళరు. అడవంతా మోదుగుచెట్లు, తుమ్మచెట్లు, కాని ఎవరికీ ఒక పుల్లముట్టే సాహసం కూడా లేదు. ఒకప్పుడు సర్కారువాళ్లు ఈ అడవిని సాపుచేయాలనే ప్రయత్నముతో ట్రాక్టరు తీసుకవస్తే డ్రైవరు చచ్చిపోయాడనీ, ఆ రాత్రి జమీందారుగారి తల్లిగారికి ఏదో కలవస్తే వారు ఈ బ్రహ్మబాబాకు ఓ మండపం కట్టించి ఆయన్ను ఇంకా సుప్రతిష్ఠితున్ని చేశారనీ చెప్పుకుంటారు. బద్లూకు మాత్రం ఈ మోదుగువనం కామధేనువులాంటిది. బబ్బర్ దొంగతనంలో పట్టుబడ్డ నాటినుంచి ఠాకుర్ బద్లూను కళ్ళంవైపుకూడా తొక్కిచూడనివ్వలేదు. చేయటానికేమీలేక వాడీ అడవిలోని కట్టెలూ, లక్కా, ఆకులూ, దొన్నెలూ వీనిపై ఆధారపడి బ్రతుకసాగాడు. పోయిన సంవత్సరం జమీందారీ రద్దైనదని వినగానే వాడు చాలాసంతోషపడ్డాడు. లోకంలోని భూ మ ం తా తనదే ననుకొన్నాడు. సంతోషంవల్ల నిద్రే పట్టలేదు. తినటానికి తాగటానికీ కావలసినంత దొరుకుతుందన్న ఆశవల్ల కలిగిన సంతోషం వానిని నేలమీద నిలువనీయలేదు. కాని ఒకనాడు పరిసియాకువెళ్ళే బాటపై ఇటుకలు కుప్పబడుతుండటం చూశాడు. ఏమిట్రా అని విచారిస్తే సర్కారువారు ఈ భూమంతా ఎవరికో హర్రాజులో ఇచ్చారని తెలిసింది. చూస్తూండగానే గుత్తేదారు మనుషులు అడవిని తమ అధీనం చేసుకున్నారు. 'బంగ్లా త యా రై ం ది. కూలీలు, నౌకర్లు, సమూహానికి సమూహం అంతా వచ్చారు. అడవిలో కట్టెలు కొట్టటం, ఆకులు తెంపుకోటం, లక్క, తేనె మొదలైనవి జ మ చే సి కో ట ం అంతా ఎక్కడిదక్కడ ఆపబడ్డవి. 'బ్రహ్మబాబా' పగ తీర్చుకొంటాడని మొదట చాలానాళ్ళవరకు బద్లూకు విశ్వాస ముండేది. ఎన్నడో ఒకనాడు గుత్తేదారుకు గత్తర తప్పకుండా తగులుతుంది అని వా డను కున్నాడు. కాని అట్లాంటిదేమీ కాలేదు. 'బ్రహ్మబాబా' ముసలివాడై పోయాడనీ, వాని తేజస్సు క్షీణించిందనీ అందరితోబాటు వాడూ అనుకున్నాడు.

బద్లూ యీ గుత్తేదారు వద్దకు పోయినప్పుడు ఆయన వరండాలో కూచొని బండ్లవాళ్ళను సముదాయిస్తున్నాడు. బండీ వాళ్ళు ఎప్పటి బాడుగ అప్పుడే కావాలని కోరుతుంటే మరెప్పుడో తీసుకపోవుటలో ఉన్న లాభాలను ఆయన వాళ్ళకు విశదీకరిస్తున్నాడు. బాడుగ అప్పటికప్పుడే ఇచ్చేస్తే మఱునటిరోజు ఈ బండీవాళ్ళు వస్తారో రారో అని ఆయన భయం. బాకీ పెడితే వాళ్ళు చేతిలో ఉంటారు. చాలాసేపు కిందుమీదులు పడి గుత్తేదారు ఎట్లాగో బండీవాళ్ళను పంపించిన తరువాత ఆయన దృష్టి స్తంభాని కాను కొన్న బద్లూమీద పడింది.

"ఏమిరా బద్లూ.... పోయి కట్టెలుకొట్టు. మీరంతా పొద్దెక్కేదాకా అటూఇటూ తిరుగుతూంటారు. మళ్ళీ కూలీలో ఒక్కపైసా కోస్తే చెవిలో ఒక్కటే రొద." అన్నాడు గుత్తేదారు.

"గుత్తేదారుగారూ" చేతులు జోడించి మొదలు పెట్టాడు బద్లూ. "నా బిడ్డకు అమ్మవారు తేలింది. రెండు రూపాయ లిప్పించండి. ఎల్లాగో కష్టం చేసి మళ్ళీ తీరుస్తాను."

"పరాచికా లాడుతున్నా వేమిరా? పోయిన వారానికి కూలీడబ్బు పంచి మూడురోజులైనా కాలేదు. మళ్ళీ కూలి కావాలని వచ్చావా? దిక్కులేనివాళ్ళకి ఊరకే అన్నం బెట్టటానికి నే నేమన్నా సత్రం తెరచా ననుకున్నావా? నీకిస్తే మిగిలిన యాభై మందీ పైన బడతారు. ఇవ్వాళ నీ బిడ్డకు మశూచికం పోస్తే

రేపింకొకరికి ఏమో అవుతుంది. ఎందరికని సహాయం జేస్తాం. వీల్లేదు."

బద్లూ చాలాసేపు బ్రతిమిలాడాడు. కాని గుత్తేదారు, ససేమిరా వినలేదు.

"పోనీ, నా మూడు రోజుల కూలి -పన్నెండణాలైనా- ఇప్పించండి. అదైనా కొంచెం తొందరగా ఇప్పించండి బాబూ. ఆ ఉన్నప్రాణం కాస్తా పోయింతరువాత దొరికి మాత్ర మేం లాభం ?"

గుత్తేదారు వానివైపు చూడకుండా ఇంకోవైపు చూస్తున్నాడు. వాని హఠం విని కోపం వచ్చి అన్నాడు. "మీతో పనిచేయించుకోపటమే కష్టం వెదకి తెచ్చుకోవటం. ఏడురోజులకూలీ కలిపి ఎందుకిస్తున్నానో మీకు నేనెట్లా చెప్పేది? నెత్తిలో ఉన్నది పేడగదా ? చెపితేమాత్రం తెలిసి చావద్దూ ? పో! పో! ఇంకేదైనా ఏర్పాటు చేసికో. ఇంక మూడు రోజుల తరువాత రావాలసిన దానికి ఇవ్వాళ వచ్చాడు. నేనేమన్నా పారిపోతున్నానా ?"

బద్లూ హృదయం చిన్నతనమూ, చేతకానితనమూ, దీనత్వమూవల్ల కంపించి పోయింది. వాని శరీరం బాధచేత కదలిపోయింది. అవమానంవల్ల నిస్సహాయతవల్ల, వైఫల్యంవల్ల వానిలోని క్రోధాగ్ని ప్రజ్వలించింది. కోపంచేత ఎఱ్ఱబడిపోయిన ముఖం దెబ్బతిన్న పాము పడగవలె కంపించసాగింది. ఈ దెబ్బతో వాడు పిచ్చివాడులా అయిపోయి అకస్మాత్తుగా గుత్తేదారుచేయి పట్టుకున్నాడు. కనుబొమలపై పేరిన చెమట బిందువులు, తాపంతో మండిపోతున్న ఎఱ్ఱని కండ్లూ, వణకుతున్న పెదవులు - ఈ ఆకారం చూచి గుత్తేదారు భయంతో అరచాడు. బద్లూ గుత్తేదారు చేయి వదలిపెట్టాడు కాని ఏమీతోచక అక్కడే నిలబడి కండ్లప్పగించి చూడటం మొదలు పెట్టాడు. ఇంతలోనే ఒక ఇరవైమందిదాకా ప్రోగై వాన్ని పట్టుకొన్నారు.

"దొంగ వెధవ" గుత్తేదారుగారికి స్పృహ వచ్చింది. ఇంతమందిని చూచి ఆయనకు పోయిన ధైర్యం తిరిగి వచ్చింది. "కట్టండిరా వెధవను."

కట్టెలు కొడుతున్న కూలీలదాకా వార్త ప్రయాణం చేసింది. అడవి ఒకమూలనుంచి ఇంకో మూలదాకా ప్రాకింది. పట్టపగలే దోచుకొనే దొంగను చూడటానికి జనం ప్రోగైనారు.

బద్లూను దగ్గరున్న వేపచెట్టుకు గట్టి తాడుతో కట్టారు. కఱ్ఱదెబ్బలతో వాని శరీరమంతా పగిలింది. కాని వాడు మాట్లాడకుండా ముఖంవంచి నేలవైపు చూస్తున్నాడు. వచ్చినవాడల్లా రెండు తన్నుతున్నాడు. రెండు తిట్టుతున్నాడు. బద్లూ కొట్టుతున్నవాని వంకనైనా చూడడు. పెదవులు బిగించి దెబ్బలు సహిస్తున్నాడు.

'అరే! వీని కంటికి నీరే రాదేమి?' లాగి తన్నుతూ ఠాకుర్ గారన్నారు. 'వీని తండ్రికూడా ఇట్లాంటి అసామాన్యుడే. ఈ గాడిదలు తరతరాల దొంగలు. లక్ష చెప్పినా, ఏంచేసినా వీళ్ళు తమ తండ్రి తాతల వృత్తి వదలరు.'

ముందునుంచి మఱూచికపు పొక్కుల మంటచేత కంపిస్తూ జ్వరాక్రాంత, టూరీ వచ్చి బద్లూ శరీరంపై వ్రాలింది.

"ఏంచేశాడు మా అయ్య." అని అడిగి టూరీ ఏడ్వటం మొదలుపెట్టింది. కాని బద్లూ కోపంతో దానిని దులిపి దూరంగా పారవేశాడు. టూరీ తిరుగులు తిరుగుతూ ఓ వైపు పడిపోయింది. బద్లూ కండ్లు కోపంతో ఎఱ్ఱబారినవి. ఇరవై ఏండ్లక్రిందట తన తండ్రిని పట్టుకొన్నప్పుడు తానూ ఆదేప్రశ్న అడిగాడు. తండ్రి తన్ను విసరిగొట్టాడని ఆనాడు తనకు కోపం వచ్చింది. ఆ విసరికొట్టటంలోని రహస్య మంతా నేడు వానికి విస్పష్టమైంది. ఇన్ని కఱ్ఱదెబ్బలచేత ఏ రాతికన్ను చెమర్చలేదో, తండ్రి స్మృతివలన అందులో కన్నీటిగంగ బిలబిలలాడింది.

*—హిందీ నుండి అనువాదం.*

*'సిద్ధార్థ'*

# పుస్తక సమీక్ష

## కిర్మీరం

రచయిత : మాదిరాజు రంగారావు
ఆదర్శ సాహిత్యమాల, దబీర్ పూరా 17-5-350, హైదరాబాదు.
వెల : 75 న. పై.

ఈ కవితా సంపుటి —'ఉషోగమనాన్ని గుర్తించి, స్వాగతమిచ్చిన వైతాళికుడు, మహాకవి, శ్రీశ్రీకి అంకిత మీయబడింది. ఇందులో ఇరవై గేయ ఖండాలున్నాయి. అత్యంతాధునిక భావనాభిలాష, అపరూప కవితా పదచిత్రణ, అపూర్వ కల్పన ప్రతికృతిలోనూ సమాన ధర్మంగా భాసిస్తున్నది. సర్వత్రా కాంతిరేఖపై కవికి గల ఆరాధన సువ్యక్త మవుతున్నది. సమకాలీన 'జగన్నాదాన్ని' వినగలిగే సుకర్ణత్వమే కవికి కూసు విద్యగా ద్యోతకమవు తూన్నది. మంచినీ, వెలుగునీ, స్నేహాన్నీ, ప్రేమనీ సౌందర్యాన్నీ, కాంతినీ— ఎంత మిక్కుటంగా ప్రేమించుతాడో, ఈ కవి దౌష్ట్యాన్నీ, చీకటినీ, శత్రుత్వాన్నీ, ద్వేషాన్నీ, వికారాన్నీ, యుద్ధభీతినీ - అంత మిక్కుటంగానూ ద్వేషిస్తాడు. అనంతమైన కాంతిరేఖను ఆరాధించే ఈయువ కవి- తన కవితా వాణిని :

"మధుర మధురపీయూషావర్షిత
పుష్పీకృతాత్మ వారిదగామిని
కిణకిణ పదరచనా సంచారిణి
మత్ కవితా నృత్యన్మందాకిని !"

గా పోల్చుకుంటాడు ; కనుకనే చీకటి తెరలను తొలగించే- "కాంతి కిసలయాంగుళుల"ను దర్శించ గలడు. 'రేపో మాపో చంద్రమండలాన్ని ఆక్రమించి సూర్యమండలానికి దారులు తీయగలిగే భావి మానవ మహత్ కృషిని విశ్వసించగలడు. 'బాల్యోదయా గమనం' తో 'జరానిశానిష్క్రమణం' జరుగుతుందన్న సత్యాన్ని, మానవజాతి అనంతానుభవాలను పురస్క రించుకొని ఆకళించుకోగల డీ కవి.

"ఈ శిథిల విశ్వ దేవాలయంలో
స్వీయ దేహ శిల్పముచూచి,
ఎన్నివేల శతాబ్దములాయెను ?
పునర్జీవ సృష్టి యెప్డు జరిగెను ?"

అంటూ, తన దేహసౌందర్యాన్ని చూసి మురిసి తత్ ప్రతిరూపంగా దైవప్రతిమను సృష్టించుకొన్న మాన వుని మహత్తర శిల్ప సృజనాత్మక శక్తినిగూర్చి అబ్బుర పడగల్గుతాడు. గంభీరసాగర సదృశమైన మానవ జీవిత రామణీయకతను చూసి కీర్తించు తాడు :

"మేఘంలా మనోహరము
రాగం లా అతిమధురము
తరంగంలా ఉచ్ఛలితము

అంతటి కీర్తిమంతమైన జీవితం 'పతనం' కావడం సంభ్రమితం కాదా ?- నిజమైన కవితాహృదయంతో సాక్షాత్కరించడం కాదా ?

"సదూహా లేఖావిష్కారమయం
ఇంద్రధనుర్వల్లీ వలయితం
సంప్రదాయ రేఖా సీమితం"

గా మనిషి జీవితాకాశ సర్వస్వాన్నీ భావించ గల్గుతాడు.

"గాలికి కాసారంలో చిరుతరగలు లేచి
కదలినట్లు, ప్రేలియాడు మంచుతెరలు
తెగి పడినట్లు, పగలడానికి తగని
ఎత్తునుండి గాజుగ్లాసు జారిపడినట్లు."

ఆశ్చర్యాన్నీ, ఆహ్లాదాన్నీ కలిగించే "యెవలో ఏదో సన్నని ధ్వని" తరంగాల గురించీ, తత్ ప్రత్యా మ్నాయంగా కలిగే కవితావేశ సంస్పందనల గురించీ కవి హృదయంగమంగా చిత్రించ గలడు.

"వృక్ష వర్షీయసి పండిన ఆకుల కోర్కెలు విడుచు వేళ—శైశిరవిచార వాయువుల్లా నెమ్మదిగా" వచ్చే అదృశ్యశక్తుల గురించి, వ్యక్తుల గురించి జాలిగా ప్రశ్నించగలడు. వేయేల ? మనోజ్ఞ కవితా హృదయంతో నిత్య నైమిత్తికమైన జీవితానుభూతుల నన్నిటినీ—తన్ను పలుకరించే, నిలిపి ప్రశ్నించే, గాయపరచి కన్నీరు ప్రముచ్చిలించే, తనువు పులక రింప చేసే — ప్రతి సన్నివేశాన్నీ కవితావేశంతో

చిత్రించ గలడు। "వెలుగు-చీకటి" "ఛాయ", వంటి ఖండకృతులు ఈ సంపుటిలో కవితా పరాకాష్ఠనందుకుంటున్నవి. ఏమైనా

"నవ్య దీప శిఖాతోరణమ్ము
దివ్య దీధితీ ప్రసారణమ్ము"

గా భాసిస్తూన్న ఆధునిక కవితా ప్రవంతిలో యీ 'కిర్మీర' మొక ఉత్తుంగ తరంగం।

ఈ కవితా సంపుటిలో పైన పేర్కొన్న కాంతి రేఖలతోపాటు పరిహరించుకో వలసిన చీకటి నీడలు పైతం సహృదయ పఠితకు గోచరమవడం చింతనీయమే। పదచిత్రములపై గల మోజు—భావనా శబలతను కుంటుపరుస్తూన్నది. సమాస ఘటన యెడలగల ఆప్యాయత—అర్థస్ఫూర్తికి నేత్ర కుసుమంగా తయారవుతూన్నది. పదాడంబరపు పటాటోపం ప్రసన్నతా గుణాన్ని అవరోధిస్తూన్నది. దూరాన్వయాలు—కవితా భావనాస్ఫూర్తికి వ్యంజనకూ శృంఖలా లవుతూన్నవి. కొన్నిచోట్ల గల అన్వయాభావమూ, అన్వయ క్లిష్టతలవంటివి—పఠితృ హృదయానికి కలిగే ముద్రలను కలిపివేస్తున్నాయి. అంతేగాక ఒకే గేయ ఖండికలోని ప్రతి నాల్గు పాదములకూ ఛందోరీతులు—కవితో నిమిత్తం లేకుండా స్వేచ్ఛగా మారిపోవడం—ఛందస్సౌందర్యానికి ప్రతిబంధక మవుతూన్నది. దీర్ఘ సమాసాల తర్వాత; "లాగ, ఊని, లా" వంటి తేలిక ప్రయోగాలను చేయడం గాంభీర్యతను చెరుస్తున్నాయి.

మన మెంతటి అధునాతన కవితా సమయాలు సృష్టించుదా మనుకొన్నా — సాంప్రదాయికంగా వస్తూన్న కవితా సమయాలకు భిన్నమైన వాటినే కేవలం సృష్టించుకోగల మనుకోవడం వట్టి భ్రమ మాత్రమే। మన కవితా మహీరుహం, అనుస్యూతమైన సంప్రదాయంలో లోతుగా వేళ్లూనాలి. వర్తమానంలోని పుష్టితో ప్రాను చేవ తేరాలి. భవిష్యదాకాశ కాంతిపథాలకు కిసలయ కుసుమాదులను వ్యాపింపచేసుకోవాలి.... ఇట్టి సంప్రదాయ జ్ఞానం మన కున్నట్లయితే - 'వృక్షపు నీడలను ఎడారి' గా భావించడం (పు. ౯.) శోచనీయం కాదా? అలాగే మందార సుమవృక్షాలనటం తెలుగుతనం కాదు.

అంతేగాక

"మతిచెడి లోకం, చీకటినే
గాఢంగా వాంఛిస్తూన్నది
.... .... .... ....
తెల్లని మబ్బులకోసమై
జగమంతా తపిస్తూంది."

అని కవి చిత్రించినపుడు ఈ 'లోక, జగత్' పదాలకు కవి యూహించిన వైరుద్ధ్యం - పఠిత కెలా స్ఫురిస్తుంది? పైగా సర్వత్రా ఈ రెంటినీ పర్యాయ పదాలుగామాత్రమే స్వీకరించడం మన సంప్రదాయం. పోనీ ఉత్తమమైనదిగా కవిభావించిన 'జగతి' తెల్లని మబ్బులకోసం' ఎందుకు తపించాలి? మబ్బులను కాంతికి సంకేతాలుగా వాడటం ఎక్కడి సంప్రదాయమో మరి? "జలధారలు హైమశైలీరూపమెత్తి నవ్వుచుండె" నట। ఏమిటీశైలి? ఎవ్వరికీ అర్థమందని (కవితోసహా) పదాలను ప్రయోగించడం 'ఉత్తమకవిత' కు లక్షణమా???

ఇలాంటి లోపాలు కవి చిత్రించదలచిన భావాలను పఠిత "బుద్ధికి అందీ అందక, అప్పుడప్పుడు మెరసిపోవు యూహాజగత్తు" స్వరూపాలుగా మాత్రమే మృగతృష్ణలుగా మాత్రమే కదలిపోతూంటాయి।

ముందుముందు ఈకవి ఉత్తమ కవితా సృజనకు పూనుకొని, ఈ తరం కవులకు అగ్రేసరు డవుతాడని విశ్వసిస్తున్నాను. ఈ సోదర కవితోపాటు - ఈర్ష్యాగ్రసితమైన ఈలోకం మారి తీరుతుందని విశ్వసిస్తూ, అతనితోపాటు ఏకగ్రీవంగా ఆమారే లోకానికి ఆహ్వాన గీత మిలా వినిపిస్తాను.

"కాలచక్ర భ్రమణంలో
పూర్వరంగ మంతరించె
ఋతువుమారె. వీచే
గాలుల దిక్కు మారె।"

శ్రీనాథమూర్తి